☛ ఖబర్దార్

# బద్మాష్

కథానాయకుఁడు.—తటాక పరిసరస్త్రీ హత్యకుఁ గారకుఁడైన చోరశిఖామణి. ఈ గ్రంథ విశేషాంశములు మును మున్ను ప్రకటింపఁబడును.





—: గ్రంథకర్త :—

గుండిమెడ వేంకట సుబ్బారావుగారు, బి. ఏ.

“రాణాప్రతాప్” “ఖిల్జీరాజ్యపతనము” మొదలగు నాటకముల మూలమున నాంధ్రసోదరులకు చిరపరిచితులు.

వేగుంజుక్క గ్రంథమాల:—51

# మేవార్ పతనము.

( చరిత్రాత్మక నాటకము. )



—: గ్రంథకర్త :—

గుండిమెడ వేంకట సుబ్బారావు, బి.ఏ.

*Author of*

*"Rana Pratap" "Khilji Rajya Pathanam" Etc.*

*1 St. Edition.*

*Printed & Published by:—*

*Pundit Bh. N. Sarma.*

at

Sree Rama Press.

Berhampur, Ganjam Dt.

 [Price Re 1-0-0

# పీ ఠి క.

ఆంధ్రసోదరులారా!

సుప్రసిద్ధ వంగదేశ కవిచంద్రుఁడగు ద్విజేంద్రలాల్ రాయల "మేవార్ పతనము" న కిది స్వేచ్ఛానువాదము. మూల గ్రంథమును చేతఁబట్టి, ఆంధ్రగౌరవమును హృదయమున నిలిపి రంగస్థలమును దృష్టి పథమునందుంచుకొని రచించిన నాటకమిది. "రాణా ప్రతాప్" అను నాప్రథమగ్రంథమును, నిదియు నొక్క బిగిని రచించినవే. అయినను నేటి దనుక దీనికి ప్రచురణ భాగ్యము లభింపకుండుటకు నేనే యుత్తరవాదిని. "మేవార్ పతనము" లింకనేకే యనేకములు ముద్రితములై యున్నవి. తిరిగి దీనిని ప్రచురింపనేల, యని తలఁచి దీని నడుగునఁబడవైచితిని. ఆరేండ్లు గడచిపోయినవి. ఈనడుమ "ఖిల్జీరాజ్య పతనము" అను మఱియొక నూతన నాటకమును రచించి ప్రచురించి యుంటిని. మేవార్ పతనము మాటయే యొకవిధముగ మఱచిపోయితిని. ఇంతలో, నాకు గురువులును, తులసీ రామాయణాద్యనేక గ్రంథనిర్మాతలును వేగుఁజుక్క గ్రంథ మాలాధిపతులును,అగు బ్రహ్మశ్రీ భాగవతుల నృశింహాశర్మ గారిని నేను దర్శించుట తటస్థించినది. వారు మూలఁ బడియున్న నా మేవార్ పతనముఁ గూర్చి యడిగి దానినిఁ దమ "వేగుఁజుక్క" గ్రంథమాలయందు బ్రకటించు నభిప్రాయము సూచించిరి. "ఈ మేవార్ పతనములీవఱకెన్ని ప్రకటింపఁబడి యుండినసేమి? నీవు రంగస్థలానుభవముఁగల యొకానొక నటుఁడవు. నటులే నాటకకర్త లగుచో వారిరచన

లుండు విశేషముండక తీరదు." అని నాకు సమాధానమిచ్చి దీనినిఁ బ్రకటించు నభిలాషను వెలిఁబుచ్చిరి. నా గ్రంథమునకు ప్రచురణావకాశము లభించుటయేగాక, నాకు గురుపాదపూజావకాశము కూడలభించినదనిసంతసించి, యీ గ్రంథమును వారికి సమర్పించితిని. అత్యల్పకాలమునందే దీనిని ముద్రింపించి ప్రకటింపించి, తమ యభిమానమును వెల్లడించినందులకు వారి కనేక కృతజ్ఞతాభివందనము లర్పించుచున్నాను.

ఈ సమయమున నా గురుదేవులగు విద్వత్కవి శిరోమణి బ్రహ్మశ్రీ మాడపాక పార్వతీశ్వర శాస్త్రిగారిని భక్తిపూర్వకముగ నా హృదయమున ధ్యానించుచు ఈగ్రంథమును ఆంధ్రసారస్వత ప్రపంచమున విడచుచున్నాను. ఇందలిగుణములు మూల గ్రంథకర్తయగు ద్విజేంద్రలాల్ రాయలవి. ఇందలి దోషములకును ప్రమాదములకును మాత్రము నేనును ముద్రాపకులును భాగహారులము. తీరని హేతువులచే నిందనేకములు ముద్రణ దోషములు సంభవించినవి. ఈ దోషములు గ్రంథకర్తవా లేక ముద్రాపకునివా యని సందేహింపఁజేయు స్ఖాలిత్యములు కూడఁ బొడగట్టును. ఎవరివైననేమి? యుదార హృదయమున పాఠక మహాశయులు ఆయాదోషములను సవరించు కొనఁ బ్రార్థితులు.

ఇట్లువిధేయుఁడు,

ఛత్రపురము. 14–7–34

గుండిమెడ వేంకటసుబ్బారావు.
గ్రంథకర్త

# పాత్రలు.

## పురుషులు.

| | |
|---|---|
| రాణా అమరసింగ్ | మేవార్ రాణా |
| గోవిందసింగ్ | మేవార్ సేనాధిపతి. |
| అజయసింగ్ | గోవిందసింగ్ కుమారుఁడు. |
| సగరసింహుఁడు | రాణా అమరసింగ్ పినతండ్రి |
| అరుణ సింహుఁడు | సగరసింహుని మనుమఁడు. సత్యవతి కుమారుఁడు. |
| మహబ్బత్ఖాన్ | సగరసింహుని కుమారుఁడు. మొగల్ సేనాపతి. |
| జహాంగీర్ | మొగలాయి చక్రవర్తి. |
| గజసింగ్ | జోద్పూర్ రాజు— మ్లేచ్ఛదాసుఁడు |

## స్త్రీలు.

| | |
|---|---|
| రాణి రుక్మిణి | రాణా అమరసింగ్ భార్య |
| మానసి | అమరసింగ్ పుత్రిక. |
| సత్యవతి | సగరసింహుని పుత్రిక— మహబ్బత్ఖాన్ సోదరి. |
| కల్యాణి | గోవిందసింగ్ పుత్రిక, మహబ్బత్ఖాన్ భార్య. |

ఇంకను సందర్భానుసారముగ మఱికొన్ని పాత్రలు రావచ్చును.

వేగుంజుక్క గ్రంథమాలనుండి వెలువడిన ప్రసిద్ధ నాటకములు.

1. ప్రతిజ్ఞా చాణక్యము 0-12-0

గ్రంథకర్త:- భాగవతుల నృసింహ శర్మ గారు.

2. కాంతాపహారణము 1-0-0

గ్రంథకర్త:— పి. కృష్ణమాచారి గారు.

3. ఉత్తమ వంచకుఁడు 0-10-0

గ్రంథకర్త-: కా॥ సో॥ రామమూర్తి గారు.

4. దుర్గాదాస్ 0-12-0

గ్రంథకర్త:— వా॥ భానుమూర్తిగారు.

5. మేవార్ పతనము 1-0-0

గ్రంథకర్త:- జి.వి. సుబ్బారావు గారు. బి. ఏ.

## పునర్ముద్రణములో నున్నవి.



1. విజయ విజయము
2. విచిత్ర వీర బొబ్బిలి.
3. (ప్రతిజ్ఞా విజయ రామ రాజీయము)

(చక్కని ప్రతులు వెలువడును.)

వలయువారు:—

భా॥ నృ॥ శర్మ,
వేగుంజుక్క గ్రంథమాల
పూడిపెద్దివారి వీథి, బరంపురం (గంజాంజిల్లా.)




శ్రీరామచంద్ర పరబ్రహ్మణేనమః.

# మేవార్ పతనము.

## —ప్రథమాంకము—

### దృశ్యము 1.

స్థానము—సాలుంబర్ వీరుఁడగు గోవిందసింగ్ గృహము.

[ గోవిందసింగ్, ఆతనిపుత్త్రుఁడగు అజయసింగ్. ]



గోవిం—అజయా! మొగల్ సైన్యములు మేవార్ పై దండయాత్ర సాగింపనున్న నను వృత్తాంతము రాణావారికిఁ దెలిసినదా

అజయ— తెలిసినది.

గోవిం—ఈసమయమున వారి యభిప్రాయ మెట్లున్నది?

అజయ—మొగలాయీలతో సంధిఁగావించుకొనుటయే సర్వోత్తమ మని వారి యభిప్రాయము.

గోవిం—(ఉత్తేజితుండై) ఏమీ! సంధియా? మొగలాయీలతో సంధియా?

అజయ—ఔను. ఈవిషయము స్థిరపఱచుటకే వారు రేపటి ప్రాతఃకాలమునసామంతుల నందఱను సభాస్థానమునకు వచ్చునట్లాజ్ఞాపించిరి. మీకును సహితము వర్తమానము వచ్చినది.

గోవిం—ఏల?

అజయ—మీ యభిప్రాయముం దెలిసికొనుటకు

గోవిం—నా యభిప్రాయమా? సంధి విషయమున నా యభి ప్రాయమా?

అజయ—ఔను, తండ్రీ!

గోవిం—(గంభీరముగ) ఎట్లు?—సంధియన నేమియో నాకుం దెలియదు. ఇరువదియైదు వత్సరములనుండియు యుద్ధ భూమి తప్ప వేఱేమియు నాకుందెలియదు. యుద్ధభూమియే నాకు దివారాత్రి సంచారభూమియై యుండెను. యుద్ధభూమి యందే నాజీవితము నందధికభాగము గడచిపోయినది.

సీ॥ శత్రుభీకర ఖడ్గ ఝుంకారములె కాని,
వీణా నినాదముల్ వినియెఱుంగ!
ఆహవోన్మత్తకో లాహలంబులె కాని,
మృదుసుధా సంగీత మేనెఱుంగ!
సమద రణాశ్వ హే షారవంబులె కాని,
లీలా ప్రహాసముల్ నేనెఱుంగ!

కాలమృత్యు కరాళ । గర్జనంబులె కాని,
హేలా శుకాలాప । మేనెఱుంగ!

గీ॥ రక్తతేజస్సమాకీర్ణ । రణమె కాని,
విమతి సంబంధ కార్యాచ । రణమెఱుంగ!
జయమొ, జయశతాధిక పరా । జయమొ కాని,
ఇంతదనుక సంధియనేమొ । యేనెఱుంగ!

(ఇరువురును కొంతసేపు నిశ్శబ్దముగ నూరకుందురు.)

గోవిం—ఇంతకును, రాణావారు సంధి నేల నపేక్షించుచుంటిరో నీతోఁ జెప్పియుంటిరా?

అజయు—చెప్పి యుంటిరి. ధనధాన్య సంపూర్ణమగు నిట్టి సుందర దేశమున వృధా రక్తపాతము తగదని చెప్పియుంటిరి.

గోవిం—(ఉత్తేజితుఁడై) కావున?-వృధారక్తపాతమగును కావున మొగలాయిచక్రవర్తి పాదరకులను శిరమున ధరింప వలయునా? రక్తపాతమునకు జంకి రాజపుత్ర పరాక్ర మాగ్ని నిక్షేపము కావలయునా? అసంభవము! మే వాడ రాజ్య మిట్టి యధమాధమ పరివర్తనమునకుఁ బాల్పడునని నే నిదివఱకే గుర్తించితిని.

తే॥ గీ॥ శ్రీప్రతాపు స్వేచ్ఛావాస । సీమ యెపుడు
మాన్పుఁగనెనో శూన్యవిలాస । మందిరముగ
నాఁడె మేవాడరాజ్య వి । నాశనంబు
చేటువడుచున్నదని గ్రహిం । చితిని నేను!

ఆమహాపురుషుఁడు మరణ సమయమునఁ జెప్పియే యుండెను.

ఉ॥ ఈగతి భగ్నచిత్తమున । నీ సకలంబు పరిత్యజించి నే
నేగుచు నుంటి! నింకపయి । నీరసపుత్త్రుల పౌత్త్రజ్య రాజ్య భూ
భాగము శత్రుభూపతుల । పాలగు, నిశ్చయమంచు నమ్మహా
భాగుఁడు రక్తబాష్పములు । పాఱఁగ నేడ్చెను మృత్యుశయ్యపై!

ఆమహాపురుషుని వాక్యము రిత్తపోవునా? సర్వనాశ
నము సమీపించుచున్నది! మేవాడరాజ్యమునకు సర్వనాశనము
సమీపించుచున్నది.

అజయ—(కొంతతడవూరకుండి) తాతా! ఇట్టి సమయమున
దుర్వారమగు మొగలాయి సైన్యమును జయించుట
మన కసాధ్యమనియు, నందుచే శాంతియుతమైన యీ
రాజ్యమున నిర్హేతుక రక్తపాతమేలఁ గావింపవలయు
ననియు వారి యభిప్రాయము.

గోవిం—అజయా! నీవు సహితము వారితో నేకీభవించితివా?
మన స్వాతంత్ర్యమునుచేతులార మ్లేచ్ఛుల కమ్ముకొను
టకు నీ విచ్చగింతువా? (తీక్ష్ణముగ కుమారునివైపుఁ
జూచి) కంఠమున ప్రాణములుండ గోవిందసింహుఁడిట్టి
యధః పతనమును సహింపఁజాలఁడు. నేటి కేడు శతా
బ్దముల నుండియు శత సహస్ర నిర్ఘాత పాతములకును,
అసంఖ్యాక ఝంఝూనిలా ఘాతములకును లెక్క
సేయక, అభిమానపూర్వకముగ నెగురుచుండిన మే
వాడ రక్తధ్వజము, నేఁడు మ్లేచ్ఛుల కందజేయఁ జేసిన
మాత్రమున అల్లలనాడి నేలవ్రాలునా-మంచిది
పోయి నేను వచ్చుచుంటినని రాణావారితోఁ జెప్పుము

అజయ—చిత్తము. (నిష్క్రమించును).

గోవిం—(ఉత్తేజితుఁడై గోడకుఁదగిలియున్న ఖడ్గముఁదీసి) ఆహా! ఎన్నిదినములకు మరల నీవు నాహస్తము నలంకరించితివి. హర్! హర్! మహాదేవ్! ప్రియసఖీ! అనుగ్రహింపుము! అనుగ్రహింపుము! నేఁడు నిన్ను మేవార్ యుద్ధమునకుఁ గొనిపోయెదను. (ఆవేశమున)

సీ॥ కురిపింతు నీచేత । కుంభవృష్టిఁ నేఁడు
ప్రద్యోత విలయాగ్ని । వర్షములను!
నఱకింతు నీచేత । కఱవు తీఱఁగ నేఁడు
కపట రాక్షస కోటి । కంఠములను!
త్రాగింతు నీచేత । దాహశాంతికి నేఁడు
వాహినీ । రక్తప్రవాహినులను
మ్రోగింతు నీచేత । పుడమి బెగ్గిల నేఁడు
రసపుత్ర జయజయా । రావములను!
గీ॥ ఎంతకాల ముజ్జ్వల లీల । నీవు నాదు
హస్తము నలంకరించెద । వంతదనుక,
శౌర్యనిధియైన మేవాడ । స్వచ్ఛకీర్తి
పంకిలము కాకయుండఁగా । పాడుమమ్మ!

హర్! హర్! మహాదేవ్!—హర్! హర్! మహాదేవ్!

(ఆవేశమున ఖడ్గము ఝుళిపించుచుండును)

(ప్రవేశము—కల్యాణి.)

కల్యా—తండ్రీ! తండ్రీ! ఇదియేమి? ఇదియేమి?

గోవిం—ఇది ఖడ్గమమ్మా! ఖడ్గము! శత్రుకంఠ విచ్ఛేద నాసక్తమగు ఖడ్గము! దీనివైపుఁజూడుము.

కల్యా—తండ్రీ! దీనిని మీరించుక దూరముగ నుంచుఁడు. నేఁడు మీరు ఖడ్గము నేలఁదీసితిరి? దీనిని దూరముగ నుంచుఁడు. మీ హస్తమున ఖడ్గముఁజూడ నాకు భయమగుచున్నది.

గోవిం—భీరూ! భయమగుచున్నదా? (ఖడ్గమును భూమిపై నుంచి) కల్యాణీ! ఈ భయంకర ఖడ్గము నం దెట్టి యుప్రతిమాన సౌందర్య మిమిడియున్నదో నీకేమి తెలియును? ఇది యహోరాత్రము లేమి కోరుచున్న దో నీకుఁదెలియునా?

కల్యా—తెలియదు-ఏమి కోరుచున్నది?

గోవిం—(గంభీరముగ) రక్తముఁగోరుచున్నది! స్వేచ్ఛాకై మ్లేచ్ఛ రక్తముఁ గోరుచున్నది!

కల్యా—కాని, తండ్రీ! మొగలాయీలపై మీ కింతటి క్రోధ మేల?

గోవిం—అందులకుఁగారణము నీ జన్మభూమి యగు మేవాడ పడుగుము:-నాటి నాటికి నీ మ్లేచ్ఛరాజులు మన రాజ్యముపైఁబడుచుండుట, వారికి విలాసపాత్రము మైనది మేవాడ వారియెడ నేమి యపరాధముఁజేసియుండెను? మానవుఁడు మదాంధుఁడగునప్పుడు, వారికి న్యాయ మార్గమును జూపు నదీఖడ్గమే!

(నేలపైనుండి ఖడ్గము నెత్తును)

కల్యాణి—(భయము నభినయించును).

గోవిం—మంచిది కల్యాణీ! నీ వింక లోనికిఁబొమ్ము. ఒకానొక యత్యవసర కార్యమును జూచుకొని నేను త్వరలో వచ్చెదను.

(ఇరువురును చెరియొకవైపు నిష్క్రమింతురు)



## దృశ్యము 2.

స్థానము:—ఉదయపురమార్గము.

[ ప్రవేశము—సన్న్యాసినియైన సత్యవతి ]



సత్య—(మేవార్ దేశమును వర్ణించుచు పాడుకొనుచుఁ బ్రవేశించును)

(ప్రవేశము—అజయసింహుఁడు)

సత్య—(పాట చాలించి) అయ్యా! మీ రెవ్వరు? సైనికులా?

అజయ-ఔను. నేను మేవార్ సేనాపతులయందొక్కరుఁడను।

సత్య—నేను మిమ్ముల నొక్క విషయమునుగూర్చి ప్రశ్నింపఁ దలఁచితిని.

అజయ—ప్రశ్నింపుఁడు.

సత్య-మొగల్ సైన్యములు తిరిగి మేవార్‌పై దాడి వచ్చెనను వార్త సత్యమే యగునా?

అజయ-ఇప్పటి కింకను దాడి వెడల లేదు. కాని, రాణావారు సంధి కంగీకరింపనిచో దండయాత్ర నిశ్చయము! సంధి విషయము నిశ్చయించుటకే మొగల్ సేనాపతి దూత నంపెను. రేపటి ప్రాతఃకాలమున రాజస్థానము సందావిషయము స్థిరపడఁగలదు.

సత్య-(నిట్టూర్పువిడచి) మీ యందఱి యభిప్రాయ మెట్లున్నది? యుద్ధమునకే సిద్ధపడి యున్నారా?

అజయ-రాణా వారెట్లాజ్ఞాపించిన నట్లు చేయుటకే మేము సంసిద్ధులము. యుద్ధమా లేక సంధియా యను విష యము రాణావారే నిర్ణయింపవలసి యున్నది!

సత్య-రాణావారి యభిప్రాయ మెట్లున్నదో మీ కేమైనఁ దెలియునా?

అజయ-తెలియదు. కాని, యీ సమయమున వారు సంధియే గావింతురని తోఁచుచున్నది! ఈ విషయమై చర్చఁ గావించుటకై మా తండ్రిగారినిఁ బిలువఁ బంపిరి.

సత్య-మీ తండ్రిగారెవరు?

అజయ-మేవార్ ప్రధాన సేనాపతియగు ఠాకుర్ గోవిందసింగ్

సత్య-ఓహో! మీరు గోవిందసింహుని పుత్త్రులా? వారి యభి ప్రాయ మెట్లున్నది?

అజయ-వారు యుద్ధమే జరుగ వలయునని స్థిర సంకల్పులై యున్నారు.

సత్య-(మందహాసముఁ జేయుచు) మంచిది. నేను మీకవరోధము

కల్పించినందులకు క్షమింపుఁడు. మీరు కార్యాతురులై
యున్నట్లు తోఁచుచున్నది. ఇఁక నాకు సెలవిండు.

అజయ-మంచిది.—(పోఁబోవును)

సత్య-(తిరిగి చూచి) అయ్యా! రేపటి ప్రాతఃకాలమున నేగదా
రాజసభాస్థానమున చర్చ జరుగుట?

అజయ-ఔను.

సత్య-మంచిది.

(అజయసింహుఁడు నిష్క్రమించును)

సత్య-ఏమేమి? సంధియా? మహారాణా ప్రతాపసింహుని
యాత్మసంభవునకు మొగిలాయీలతో సంధివిషయిక
ప్రసక్తియా? చూచెదఁగాక!-రేపటిప్రాతఃకాలము!-
రాజసభాస్థానమున—చర్చ-రేపటిప్రాతఃకాలమున!—
మంచిది. సంధియెట్లు జరగునో చూచెదఁగాక!

(నిష్క్రమించును)



## దృశ్యము 3.

స్థానము:—ఉదయపురమునందలి రాజసభాభవనము.

[రాణా అమరసింహుఁడుచితాసనస్థుఁడై యుండును. ఇరుప్రక్క-
లను జయసింగ్, కృష్ణదాస్, కేశవసింగ్, శంకరసింగ్,
మున్నగు సామంతులు కూర్చుండియుందురు. ఒక
ప్రక్క- గోవిందసింగ్ కూర్చుండియుండును.]



జయ-మహారాజా! ఈ సమయమున రాజపుత్త్రులేమిచేయు

తెలియును, అను విషయమునుగూర్చి మాట్లాడు ప్రయత్నము మేముండుట యుక్తమే లోకవ్యవహారకర్తవ్యము!

అమర—జయసింగ్! రాజపుత్రులు తమ కోపమును తీర్చుకొని జహాంగీరు పాదుషా యొక్క సైన్యము వాహనము సంగ్రహింపగలరా?

జయ-ఏమి? యుగయుగ ప్రఖ్యాతమైన రాజపుత్ర తేజమును మరచుకొని! పూర్వ మహాపురుషుల ఎంత విఖ్యాతకీర్తి వైభవమును మరచుకొని! ఏమి మరచుకొన్న?

కృష్ణ-ప్రభూ! తమతండ్రిగారగు మహారాణా ప్రతాపసింగ్ ఏమి మరచుకొని అక్బరు చక్రవర్తితో నిన్నిదీర్ఘవర్షములు పోరాడిరి?

అమర-వారిమాట విడచిపెట్టుము. వారు సామాన్య మనుష్యమాత్రులు కారు.

శంకర్-వారుసహితము రాజపుత్రులు కారా?

అమర-కారు, శంకర్! వారు కేవలము రాజపుత్రులు కారు. లోకాతీతమగు దైవశక్తివలె, ఆకాశగోళమునుండి పృథ్విపై వాలు వజ్రపాతముభంగి, విశ్వభయానకమగు భూకంపమురీతి, మనుష్యమాత్రులమగు మన మధ్యమున నుత్పన్నులైరి! వారెచ్చటినుండివచ్చి, యెచ్చటి కేగిరో, యెవ్వరును చెప్పజాలరు. మానవులందఱును వారివలెఁ బ్రవర్తించుట కేవల మసంభవము.

చ॥ ఇరువదిరెండైదు వత్సరము ♦ లేను ప్రతాప నరేంద్రుతోడ, జా
గరణమునన్ మహా ప్రవాస ♦ నివ్వారధూముల సంచరించితిన్!
అరిగెను నాడు జీవితము ♦ నందు సగంబు రణస్థలంబుపై
రెండుగను సౌఖ్యమన్నదది ♦ యేమియొదుఃఖము కాక భూవరా.

ఆ దినములయందు దుఃఖమే నాకు మహాసౌఖ్యదాయకముగా నుండెను. మహారాజా! కర్తవ్యనిర్వహణముచేసి మానవుండనుభవించు దుఃఖమెంత మధురమో మీకేమి తెలియును? ఆ దుఃఖమునందెట్టి మహాసౌఖ్యమిమిడి యున్నదో మీకేమి తెలియును?-ఆహా! అవియెట్టి సుదినములు! ఎట్టి మహత్తరదినములు! ఆదినములింక తిరిగిరావు-ఆహా!

సీ॥ ఆనాటి దేవతా ♦ స్థానంబులే యివ్వి?
సురతభోగార్థ మం ♦ దిరములయ్యె!
ఆనాటి స్వేచ్ఛా వి ♦ హార భూములె యివ్వి?
బహువిలాస నికుంజ ♦ వనములయ్యె
ఆనాటి రణశిక్ష ♦ శాలయంబులె యివ్వి?
హేలాంగనా నాట్య ♦ శాలలయ్యె!
ఆనాటి వివిధాయు ♦ ధాగారములె యివ్వి?
అధ్వాన శయ్యాగృ ♦ హంబులయ్యె!
గీ॥ అకట! దేవాంశమునఁబుట్టి ♦ యఖిల జగతి
కనుప మాదర్శమగు జీవ ♦ యాత్ర గడపి
పజలి చనిన పరితాప రా ♦ణ్మౌళి తోడ
స్వర్గమున కేగ కేనేల ♦ బ్రతికి యుంటి!

కేశవ-గోవిందసింగ్! మీరు జీవించి యుండునంతవఱకును మేవాడ యశస్తేజమున కెట్టికళంకమును రానేరదు.

గోవిం—కేశవ్ జీ! నేనేమిచేయఁగలను? జరాదుఃఖపీడితుఁడనైన నేనేమి చేయఁగలను? దౌర్బల్యముచే నాకరణచరణములు కంపించుచున్నవి. ఇదిగో, రక్తమాంస విహీనమై ప్రాణమాత్రావశేషమైయున్న నాయస్థిపంజరమును చూడుఁడు. కాని, యిప్పటికిని నాకు పూర్వమువలెనే పర్వతారణ్య సంచారమొనర్చుచు మాతృభూమికై తిరిగి యానాటి మధురదుఃఖ మనుభవింపవలయునను కోరిక గాఢముగ నున్నది! కాని, యేమి ప్రయోజనము ఏమిప్రయోజనము!

(కన్నీరు గార్చును)

అమర—కాని, గోవిందసింగ్! హిందూస్థానమంతయు మొగలాయి చక్రవర్తియెదుట శిరమువంచుకొని యుండుట నీకుఁదెలిసినవిషయమే. అట్టిచో, నామమాత్రికమైన మేవాడరాజ్యము విశ్వవిజయినియగు మొగలాయి సైన్యము నెదుర్కొనుట కేవలమసంభవము కాదా? నీవే యోచింపుము.

గోవిం—మహారాజా! ఇంకనేను యోచింపవలసిన దేమియును లేదు.

(అందరును కొంతసేపు నిశ్శబ్దముగ నూరకుందురు.)

అమర—సామంతులారా! ప్రస్తుత పరిస్థితులనుబట్టి యుద్ధము నిష్ప్రయోజనమని నాయభిప్రాయము. మొగలాయీలతో సంధిగావించుకొనుటకే నేను నిశ్చయించితిని—చోబ్దార్!

చోబ్దార్-(ప్రవేశించి యభివాదముఁజేయును)

అమర—వార్తాహరుని దోడ్కొని రమ్ము.

చోబ్దార్-చిత్తము. (నిష్క్రమించును)

గోవిం-(మహాదుఃఖముతో) హా! హా! మహారాణాప్రతాప్! మహారాణాప్రతాప్!

సీ॥ నీకుమారుఁడు నీదు ॥ లోకైక విక్రమో
త్సేక ఖడ్గంబు బుగ్గి ॥ సేయుచుండె!
నీకుమారుఁడు నీవు ॥ నిలిపిన మేవాడ
విజయధ్వజముఁబట్టి ॥ విఱుచుచుండె!
నీకుమారుఁడు నీ ॥ యఖిల దిశాసమా
క్రాంత తేజము నంత ॥ ఁగలుపుచుండె
నీకుమారుఁడు నెమ్మి ॥ నీ వుద్ధరించిన
మహితాన్వయము రూపు ॥ మాపుచుండె!

గీ॥ నీకుమారుండు కుపుత్రుండు! ॥ నీదు జన్మ
భూమి మ్లేచ్ఛాధముల కప్పుఁ ॥ బోవు చుండె!
హా! మహారాజ! స్వర్గ రా ॥ జ్యంబు నుండి
యరయుచుంటివె యీ ప్రళ ॥ యంబు నీవు!

(ప్రవేశము - చోద్దాక్తో వార్తాహరుఁడు)

వార్తా-(రాణా కభివాదము చేయును)

అమర-ఓయీ! నీవు మొగల్ సైన్యాధిపతి నొద్దకుఁబోయి, మేము వారితో సంధిఁగావించుకొనుటకు సంసిద్ధులమై యుంటిమని నివేదింపుము.

(ఉత్తేజితురాలై తటాలున చారణీవేషమున సత్యవతి ప్రవేశించును)

సత్య-(గంభీరముగ) అసంభవము! అసంభవము! ఏమనుచుంటిరి రాజపుత్త్రులకు శత్రువులతోడ సంధియా? మ్లేచ్ఛుల తోడ సంధియా? మేవాడరాజ్యమున పురుషప్రాణి మిగులు నంతవఱకు నట్టిది పొసగనేరదు. సామంతులారా! మీరెల్లరును యుద్ధమునకు సిద్ధముగ నుండుడు

గోవిం-(మహానందమున) దేవీ! నీవెవ్వతెవు? ఈ నిబిడాంధకారమున విద్యుల్లతవలెఁ బొడఁగట్టిన నీ వెవ్వతెవు తల్లీ? ఈ కోమల గంభీరవజ్రధ్వని యెవ్వరిదో చెప్పి మమ్ములఁ గృతార్థులఁజేయుము!

అమర-(విస్మయముతో) కాంతా! నీ వెవ్వతెవు? సత్యముఁ బల్కుము.

సత్య-మహారాజా! నేనొక చారణిని. గాయకురాలను. మేవాడ దేశమందలి ప్రతి శిలయు, ప్రతి వృక్షమును, ప్రతిధ్వనించునట్లు మేవాడవీరుల కీర్తిగీతములను

పాడుకొనుచు నహోరాత్రములు సంచరించు చుండెను
అంతకుమించి చెప్పుట కిప్పుడవసరము లేదు.

సామంతులు—ఆశ్చర్యము!

సత్య—సామంతులారా! నూచెద రేల?

ఉ॥ సమ్మతి భూవిభుండుదయ ♦ సాగరతీర నికుంజ సీమలన్
దిరిగి పమ్మర నిండు భోగనిర ♦ తిన్ గులతేజము మంటఁగల్పి! హ
స్తమ్ముల ఖడ్గముల్ కలుగ ♦ సంధి యొనర్తురె భీరులాగ! శౌ
ర్య మ్మొకయింత కల్గినను ♦ రండు రణావని కేను వచ్చెదన్!

గోవిం-(ఆశ్చర్యముతో) ఏమిది! నాశరీరమునందీ యపూర్వ తేజ
మెటనుండి వచ్చినది? మహారాజా! రణస్థల మెట్టిదో
యెరుఁగని యొకానొక యబలపలుకుచున్న పౌరుష
వాక్యముల కేనియు మీహృదయమున శౌర్యము
జనింపకున్నదా? లెండు. లెండు. ఈ భోగవిలాసములను
పరిత్యజింపుఁడు. ఖడ్గము ధరింపుఁడు.

అమర-గోవిందసింగ్! నిశ్చయముగ నాహృదయము నందడఁగి
యుండిన శౌర్యజ్యోతి యీ కాంతామణి పౌరుష
వాక్యములచేఁ దిరిగి ప్రజ్వలించుచున్నది! సామంతు
లారా! లెండు. మనము యుద్ధమే చేయుదము రండు!

సత్య-జయ్, మేవార్ మహారాణాకు జయ్!

అందరు-జయ్, మేవార్ మహారాణాకు జయ్!!



## దృశ్యము 4.

స్థానము:—ఉదయపురమునందలి ఉదయసాగర తీరము.

[మేవార రాజపుత్త్రి మానసి యొంటరిగాఁదిరుగుచు పాడుకొనుచుండును. ఇంతలో నొకగుడ్డిబాలునితో నొకభిక్షుకురాలు ప్రవేశించును.]



భిక్షు—అన్నదాతకు జయమగును తల్లీ! అన్నదాతకు జయము!

మానసి-(పాటచాలించి) ఏమమ్మా! ఇతఁడు నీ కుమారుఁడా?

భిక్షు—కాఁడు. నాచెల్లెలికుమారుఁడు. వీఁడు పుట్టుగుడ్డి. వీని తల్లి చనిపోయినది.

మానసి-అయ్యో, పాపము! వీనితండ్రియైనను జీవించియున్నాఁడా?

భిక్షు-జీవించియేయున్నాఁడు. కాని, తల్లీ! ఏమిలాభము? పరదేశము నందున్నాఁడు.

మానసి-(బాలుని చెంతఁజేర్చి) అమ్మా! ఈ బాలుని నాకిచ్చెదవా? నేను పెంచుకొనెదను.

భిక్షు—తల్లీ! వీఁడు నన్ను విడచి యొక్క క్షణముండఁజాలఁడు. నేనేమిచేయుదును.

మానసి-పోనిమ్మా. నీయొద్దనే యుండనిమ్ము. కాని, ప్రతిదినము నీబాలుని నాయొద్దకు తీసికొని వచ్చుచుండుము-ఇదిగో ఈనాటిభుక్తి నిమిత్తము ఈనాణెమును గైకొనుము. (ఇచ్చును)

భిక్షు—(ఆనందముతో) రాజకుమారికి జయమగుఁగాక! మహా రాజ్య ప్రాప్తి యగుగాక! అమ్మా! సెలవుతీసికొనెదను
(బాలునితో నిష్క్రమించును.)

మానసి-(స్వగ) ఆహా! ఈ భిక్షుకురాలి యాశీర్వచనము నా కెంత హృదయానందకరముగనున్నది! జయభేరికంటెను ప్రబలతరమై, శిశువాక్యముకంటెను మధురతరమై తోఁచుచున్నది!

(ప్రవేశము—అజయసింహుఁడు)

అజయ-మానసీ!

మానసి-(తిరిగిచూచి) అజయా! రమ్ము. నాహృదయమిప్పు డమితానందమయమై యున్నది. నా యానందమును నీవుసహితము పంచుకొనుము.

అజయ-నీ యానందమునకుఁ గారణమేమి?

మానసి-నేఁడొక భిక్షుకురాలు నన్నాశీర్వదించి పోయినది.

అజయ—మానసీ! ఈ రాజస్థానమున నిన్నాశీర్వదించని వారెవ్వరు? ప్రతిదినమును ప్రజలనోటినుండి నేను మేవాడ రాజకుమారి సద్గుణప్రశంసయే వినుచుందును.

మానసి—నీవు ప్రతిదినమును వినుచుందువా? అట్లైన నే నొకసారియైనను వినకుండుటకుఁ గారణమేమి?

అజయ-గృహమువిడచి యొక్కసారి యీవలకు వచ్చితివేని, నీవుసహితము వినఁగలవు.

మానసి-పోనిమ్ము. ఆవిషయము మనకేల?—అజయా! నీకుఁ దెలిసియే యుండును. నే నిచ్చటనొక ధర్మశాలను స్థాపించితిని. ప్రతిదినము నేనచ్చటకుఁబోయి స్వయముగ నభ్యాగతులకు భోజనమిడుచుందును. అట్లు చేసిన గాని నాహృదయమునకు శాంతియుండదు.

అజయ—మానసీ! నీ జీవనము ధన్యమైనది!—నేఁడు నేను నీ యొద్ద సెలవుగైకొనుటకు వచ్చితిని.

మానసి—ఏమి? నీ వెచ్చటకుఁబోయెదవు?

అజయ—యుద్ధమునకుఁ బోయెదను.

మానసి-తిరిగి యెప్పుడు వచ్చెదవు?

అజయ—అది చెప్పఁజాలను; తిరిగి వచ్చెదనో లేదో కూడ తెలియదు.

మానసి-ఏమి?

అజయ—యుద్ధమునందు మరణించుటయుఁగూడ సంభవమేకదా

మానసి-ఔను. (యోచనాపూర్వకముగ తలవంచుకొనును)

అజయ—మానసీ! నేను తిరిగి రాకుంటినేని, నీవు దుఃఖింతువా?

మానసి-ఏల దుఃఖించను?

అజయ-నాకునీపై నెంతప్రేమకలదో నీకుఁదెలియును—

మానసి—ఔను. నీవునన్నుఁ బ్రాణాధికముగఁ బ్రేమింతువని నాకుఁ దెలియును.

అజయ—నీవు నన్నుఁ బ్రేమించు చుంటివా?

మానసి-(చిరునవ్వుతో) నీకట్టి సందేహమేల కలిగినది? నేను

నిన్ను తప్పక ప్రేమించుచుంటిని.

అజయ—లేదు. నీప్రేమ వేరొకరిపై నున్నది.

మానసి—ఔను. సమస్తమానవజాతిపై నున్నది. అజయా నేను కేవలము నిన్నుఁదప్ప వేరెవ్వరినిఁ బ్రేమింప కుండ వలయుననియా నీకోరిక? అట్లయిన, నీవొక స్వార్థపరుఁడవు.

అజయ—మానసీ! నీవొక యబోధినవనియు, అజ్ఞానివనియు, ఇంతవరకును నాకుఁదెలియదు.

మానసి—అజయా! నాపై నీ వాగ్రహించితివా? నాయపరాధ మేమి? సమస్త మానవజాతిని నేను ప్రేమించుట యపరాధమగునా? అది యపరాధమేయైనచో నీవు నన్ను దండింపుము.

అజయ-నిన్ను దండింపవలయునా?

మానసి-దండింపుము. అజయా! నేఁడునీవు యుద్ధక్షేత్రమునకుఁ బోవనున్నావు. ఆయుద్ధమున నీవెన్నిహత్యలుగావింతు వో ప్రజలు నిన్నంత శ్లాఘింతురు. హత్యయే లోక మున శ్లాఘాపాత్రమైయుండ నేను మానవజాతిని ప్రేమించుట యపరాధముకాదా?

అజయ—(కొంతతడవూరకుండి, పశ్చాత్తాపముతో) మానసీ! నీవు సమస్తమానవజాతిని ప్రేమింపుము. నీ యుదార హృదయసీమను విశ్వమునంతయు నుంచుకొనుము. నేను కేవలమొక మూర్ఖుఁడను. నీనిష్కళంక చిత్త

వృత్తిని గ్రహింపఁజాలక పోయితిని

తే॥ గీ॥ నిర్మలాకాశమును బోలు ♦ నీ విశాల
మానసంబును, దుర్బలం ♦ బైన యట్టి
నా హృదయ సూక్ష్మ పేటికాం ♦ తరము నందు
దాచ నెంచిన మానుషా ♦ ధముఁడ నేను!

మానసీ! నన్ను క్షమింపుము. నాయపరాధమును మరచిపొమ్ము. ఇంక నాకు సెలవొసంగుము.

మానసి-మంచిది. అజయా! పొమ్ము. యుద్ధభూమికిపొమ్ము:
యుద్ధమనిన నాకొకవిధమగు హేయభావమేకలదు, కాని, లోకమున అన్యాయమును, అత్యాచారమును ప్రబలమైనప్పుడు యుద్ధమనివార్యమనియే తోచు చున్నది. కాని, యుద్ధమొక నిష్ఠురకార్యము. అజయా అవకాశమున్నంతవరకు రణవ్యాపారమునందు నీ పవిత్రత నీవు నిలుపుకొనుము.

అజయ-మంచిది. (నిష్క్రమించును)

మానసి-(పోవుచున్న అజయసింహునివైపుఁజూచుచు) అజయా నిర్విచారముగ రణభూమికిఁబొమ్ము. నా సత్కార్య ఫలము నిన్నొక యభేద్య కవచమువలె రక్షించుఁగాక! (కొంతతడవూరకుండి) యుద్ధమున మృతినొందువారే మయ్యెదరు? వారివారి స్త్రీజనములు నాయట్లే వారి వారి పురుషుల మాంగల్యమునకు సర్వేశ్వరునిఁ బ్రా ర్థింపరా? అందెవ్వరిప్రార్థనము ఫలప్రదమో, యెవ్వరి

ప్రార్థనము నిష్ఫలమో తెలియదు. ఈ భీషణకృత్యము నకుఁ బ్రతివిధానము లేదా? (కన్నుల నీరుగ్రమ్మ, కొంత తడ వూరకుండి పిమ్మట మహానందముతో) మంచిది. ఇప్పుడు నేనొక మహత్తరకార్యమును జేసెదను. యుద్ధమున మరణించువారికి నేనెట్టి సహాయమును చేయఁ జాలను కాని, యుద్ధమున గాయములుతగిలి ప్రాణావశేషులైన సైనికులకు నేను వలయునంత సేవఁజేయఁ గలను. ఈ మహత్తరకార్యమును తప్పక చేయుదును.

( ప్రవేశము—రాణి రుక్మిణి )

రాణి—మానసీ! వింటివా?

మానసి-ఏమమ్మా?

రాణి-మీ నాయనగారు మొగలాయీలతో యుద్ధమునకుఁ బోయిరి.

మానసి—ఔను. వింటిని.

రాణి—మానసీ! యుద్ధమనిన నేమియో నీకుఁదెలియునా? ఎందఱు మానవులు మరణింతురో తెలియునా?

మానసి- తెలియును.

రాణి—యుద్ధమునకుఁబోవక, యింటికడనుండు స్త్రీజనముల కెట్టి దశపట్టునో నీకుఁదెలియునా?

మానసి- తెలియును. అందుకు మనమేమి చేయఁగలము?

రాణి—నేనింతదనుక నీ వివాహప్రయత్నమునుగూర్చి మీ తండ్రిగారితో మాటాడుచుంటిని. కాని, ఇప్పుడిఁక

వ్యవధి లేదు. ఇట్టి యుద్ధసమయమున వివాహమెట్లు జరుగును?

మానసి-కాని, తల్లీ! నాకు వివాహమే వలదు.

రాణి-(చకితయై) ఏమీ! వివాహమే వలదా?

మానసి-ఔనమ్మా! వివాహము కాకున్ననే నాకు మేలు,

రాణి–అదెట్లు? అవివాహితవై యెంతకాలముందువు? ఇట్టి పిచ్చిమాటల నిఁకఁ జాలింపుము. మోఘపుర రాజకుమారునితో నీకువివాహము నిశ్చయమైనది. ఇంతలో నీపాడుయుద్ధము వచ్చినది. వివాహకార్యముజరపి యుద్ధమునకుఁబోయి యుండినచో యుక్తముగనుండి యుండును. కాని, మీనాయనగారు నామాటవినరైరి.

మానసి-అమ్మా! నావిషయమై నీవు చింతింపవలదు. వివాహముకంటెను ఘనతరమైన కార్యమొకటి నేనిప్పుడు సంకల్పించుకొంటిని.

రాణి–అదియేమి?

మానసి-నేను యుద్ధక్షేత్రమునకుఁ బోయెదను.

రాణి–ఎందులకు?

మానసి-అమ్మా! నీవిప్పుడిప్పుడేకదా చెప్పియుంటివి యుద్ధమునందెందఱెందఱో మరణింతురని.—

తే॥ గీ॥ కదనహతులైన వీరాగ్రి । గణ్యులకును
జనని! నీనేమియును చేయఁ । జాలఁగాని,
ప్రాణములతోడ రణభూమి । వ్రాలియున్న
సైనికుల కేను పరిచర్య । సలుప లేనె?

రాణి-అసంభవము! అజయసింహుఁడు నీకీమాటలు నేర్పినాఁడో యని తోఁచుచున్నది.

మానసి-లేదు. ఆతఁడు నాకేమియు నేర్పలేదు. ఆతనికి, నాకును అభిప్రాయ భేదముకలదు. ఆతఁడు మానవులను హత్యగావించుటకుఁ బోవుచున్నాఁడు. నేను వారిని రక్షించుటకుఁ బోవుచున్నాను.

రాణి-నేను నీవు యుద్ధరంగమునకుఁ బోవుటకు పలను పడను.

మానసి-అమ్మా! నీవు నిర్విచారముగ నుండుము. నేనవశ్యము పోయెదను, కర్తవ్యము నన్నుఁ బిలచుచుండిన సమయమున నేనెవ్వరిమాటలను లక్ష్యముచేయనని నీకే తెలియును.

రాణి-ఎవ్వరితో నీవు పోయెదవు?

మానసి- అజయ సింహుని సైన్యముతో పోయెదను.

రాణి-(ఇంచుక కోపస్వరమున) అంతయు నేను సంశయించి నట్లే జరిగినది. నీకు బుద్ధిచెప్పుటకు రాణావారు ప్రహిత మింటి యొద్ద లేరు.

మానసి-వారింటియొద్ద నుండినను నన్నీ సత్కార్యమునుండి మరల్ప యత్నింపరు.

రాణి-వారు నిన్నిట్లు తలపై నెక్కించుకొనుట చేతనే నీవిట్లు మితిమీరుచున్నావు. (కోపముతో నిష్క్రమించును)

మానసి-(స్వగతము) ఆహా! యుదారభావము నాహృదయమున జనించినది! ఈసంకల్పమును తొలుదొల్త నా

మానసమునం దుదయింపజేసిన దెవ్వరు? ఆదినుండియు నీ ప్రేమజ్యోతి నాయంతఃకరణమునం దొకా నొక మూలను మినుకు మినుకు మనుచుండెను. కాని, యి ప్పుడునాహృదయ గోళమంతయు జ్యోతిర్మయమై యు న్నది. ఆహా! ఎట్టి పరమానందమును నేనిప్పుడనుభవిం చుచున్నాను! ఎట్టి స్వర్గీయ సౌఖ్యము నేనిప్పుడుచవి జూచుచున్నాను! వివాహమునం దిట్టిసౌఖ్యముండునా?

(నిష్క్రమించును)





ఓం

శ్రీరామచంద్ర పరబ్రహ్మణేనమః.

# మేవార్ పతనము.

## ద్వితీయాంకము.

### దృశ్యము 1.

స్థానము—ఆగ్రాయందు రాజా సగర సింహుని గృహము.

[రాజా. సగరసింహుఁడు, ఆతనిమనుమఁడు అరుణసింహుఁడు కూర్చుండి యుందురు]



సగర-అరుణా! అమరసింహుఁడు దేవార్ యుద్ధమున మొగల్ సైన్యములను గడ్డిపోచలవలె నఱికి వైచెనట! ఎట్టి యాశ్చర్యకరమగు విషయము!

అరుణ-ధన్యుఁడు! రాణా అమర సింహుఁడు ధన్యుఁడు!

సగర-బాల్యమునందు అమరసింహుఁడు భోగేచ్ఛాపరుఁడై కేవలము శుంఠయైయుండెను. అట్టివాఁడు ఇప్పుడిట్టి రణధీరుఁడగు నని యెవ్వరనుకొనిరి?

అరుణ-తాతా! వాల్మీకిమహర్షి మొట్టమొదట నొక బందెపోటు దొంగయై యుండలేదా?

సగర-(ముఖము చిట్లించుకొని) వాల్మీకిమహర్షి యెవరు?—
ఓహో! తులసీదాస్ కుమారుఁడా?
అరుణ—(పకపకనవ్వి) తాతా! మీరు వాల్మీకిపేరే వినలేదా?
ఆతఁడొక గొప్ప మహాముని, తాతా!
సగర-ఓహో! అట్లనా? ఔనౌను. ఆతని నెక్కడనో చూచి
నట్లున్నది! కాని జ్ఞప్తిలేకున్నది!
అరుణ-(నవ్వుచు) ఆతని మీరెట్లు చూడఁగలరు తాతా?
ఆతఁడు త్రేతాయుగమువాఁడు
సగర-ఏయుగమువాఁడు?
అరుణ-త్రేతాయుగమువాఁడు.
సగర-సరే! అట్లైన, అది నాజన్మమునకు పూర్వపు విషయము
కాని ఆతని పేరుమాత్రము వినియుంటిని. ఆతఁడు
గొప్ప రసికుఁడట, కాదా?
అరుణ-అయ్యో, తాతా! అట్లుకాదు. ఆతఁడు రామాయణ
మును రచించిన మహాకవి!
సగర—అట్లనా? రామాయణము చాలగొప్పగ్రంథమట!
అరుణ-ఏమి తాతా! మీరు రామాయణమే చదువలేదా?
భగవాన్ రామచంద్రుఁడు మన పూర్వపురుషుఁడు
ఆ గ్రంథమునందు ఆమహాపురుషుని చరిత్రము వ్రాయ
బడి యున్నది. ఆతనిఁగూర్చి మీకు తెలియనే తెలి
యదా తాతా! ఎంతపాపము, తాతా!
సగర-నాయనా! ఆగ్రంథమును నేనెట్లు చదువుదును? ఎచ్చట

చదువుదును? యుద్ధములయందే నాజన్మము గడచి పోయినది. ఇంక నాకు గ్రంథములు చదువుటకు సమయ మెక్కడ? నీవే చెప్పుము.

అరుణ-అట్లైన, మీరుసహిత మొకప్పుడు యుద్ధముఁజేసి యుంటిరా?

సగర-ఇంక నడుగుచుంటివా? ఎన్నెన్ని మహాయుద్ధములందు పాల్గొని యుంటిని! ఎన్నెన్ని మహాపజయములనుగాంచి యుంటిని! అప్పటికింకను నీవు జన్మించి యుండలేదు.

అరుణ-మీరేయే యుద్ధములందుఁ బాల్గొనియుంటిరి? ఎవ్వ రెవ్వరితోఁ బోరాడియుంటిరి? చెప్పుడు.

సగర-జ్ఞాపకముచాలదు నాయనా! కాని, పెక్కుసార్లు యుద్ధ మునకుఁ బోయియుంటిని. ఆ సమయమున నీతల్లి—

అరుణ-నా తల్లి—తాతా! నాతల్లి యెచ్చటనున్నది?

సగర-ఆమె యెచ్చటనున్నదో యెవ్వరికినిఁదెలియదు. ఒకనాటి ప్రాతఃకాలమున నామె శయ్యపైనుండి లేచి, పిచ్చి యెత్తిన దానివలె, "మేవార్! మేవార్!" అని కేకలు వేయుచు నెచ్చటికోపోయినది.

అరుణ-నా తండ్రిగారెచ్చట నున్నారు?

సగర-ఆతఁడు మొదటినుండియును పిచ్చివాఁడె! జోద్పూర్ ప్రభువగు గజసింహునివెంట గుజరాత్ యుద్ధమునకుఁ బోయి యచ్చట మరణించెను.

అరుణ-(కొంచెమూరకుండి) అట్లైన, నాతల్లి మేవార్ రాజ్య

ముందే యెచ్చటనో యుండునని తోఁచుచున్నది.

సగర-ఉండవచ్చును.

అరుణ-తాతా! మీరు మీ స్వదేశమగు మేవాడను విడచి యీ "యాగ్రా" నగరమునకేల వచ్చితిరి? మీ సహోదరుఁడగు మహారాణా ప్రతాపసింగ్ మీ మాతృభూమియగు మేవాడకై జీవరక్తమును ధారపోయుట మీ రెఱుఁగరా?

సగర-ఔను, పాపము! ఆతఁడు యౌవనమునందే చనిపోయెను. నేను చెప్పుచునే యుంటిని, కాని, యాతఁడు నామాట లక్ష్యముసేయక మొగలాయీలకు ప్రతిపక్షుఁడయ్యెను నాదోష మేమున్నది?

అరుణ-కాని, రాజపుత్రస్థానమంతయును ఆమహాపురుషుని నామాక్షరములనే ప్రతిధ్వనించుచుండుట మీకుఁ దెలియునా? ప్రతివీధియందును చారణులును భిక్షుకులును ఆమహావీరుని కీర్తిగీతములనే పాడుచుండుట మీ రెఱుఁగని విషయమా? సూర్య చంద్రులుండునంతవఱకు నాజగదేకశూరుని యశశ్శరీరము ప్రపంచమున నిలచియుండునని మీకు నేను చెప్పవలయునా?

సగర-(పెదవివిఱచి) ఏమిప్రయోజనము నాయనా? ఆతని ప్రాణమేమోపోయినది కదా! ఇంక నీకీర్తిగీతముల నాతఁడు వినుటకు వచ్చునా? తనయశశ్శరీరమును తానేమి చూడఁగలఁడా? ఇంక వీనివలన లాభమేమి?

ఇది తెలిసియే నే ననేకసారులు ప్రతాపుని మందలింప యత్నించితిని. కాని, యాతనికి నాయుపదేశములు రుచించినవి కావు. నాకేమి? హాయిఁగ నేను మొగల్ పక్షముఁజేరితిని.

అరుణ-కాని, తాతా! మొన్నటి దేవార్ యుద్ధమున మీ మొగల్ పక్షమేమైనది?

సగర-ఏమైనది? అపజయమొందినను చెక్కు-చెదరక నిలచి యున్నది! రాజపుత్త్రులిట్లు నిలువఁగలరా? ముసల్మానులసంఖ్య తగ్గిపోయినను, వారుహిందువులను తమ మతములోఁగలుపుకొని, తమసంఖ్యను తిరిగి వృద్ధి చేసికొనఁగలరు. కాని, హిందువులు ముసల్మానులను తమజాతిలోఁ గలుపుకొనఁగలరా? చూడు. నీ మేన మామ మహబత్ఖాన్ ముసల్మానుఁడు కాఁగలిగెను. అదేవిధముగ నొకముసల్మానుఁడు హిందువుకాఁగలఁడా

అరుణ-తాతా! మహబత్ఖాన్ మీకుమారుఁడుకదా? ఆతఁడు మహమ్మదీయుఁడైనట్లు మీరేల కాలేదు?

సగర—నాకు ధైర్యము చాలినదికాదు. కాని, నాకుమారునకు మాత్రము ధైర్యమెక్కువ!

అరుణ-తాతా! మీరుకూడ నవశ్యము మహమ్మదీయ మత ములోఁ జేరవలసివదే. ఏమందురా

తే॥ గీ॥ సర్వజననుతాఖిల ధర్మ ॥ శాస్త్రమునకు
నిలయమగు రామ చరితంబుఁ ॥ దెలియకుండ

భరతభూమిని హిందువై । బ్రిదుక నేల
నొక ముసల్మానుఁ డగుటయే । యుత్తమంబు!

సగర-(పెదవివిఱచి) పోనిమ్ము. రామాయణమునందేమున్నది.

(మొఁగల్ సేనాపతి అబ్దుల్లా—ప్రవేశము)

సగర-సలాం, అబ్దుల్లాసాహెబ్! దయచేయుఁడు

అబ్దుల్లా-సలాం, సలాం, రాణాసాహెబ్! (కూర్చుండును)

సగర—(ఆశ్చర్యముతో) రాణాసాహెబెవ్వరు

అబ్దుల్లా-(నవ్వుచు) ఇంకపై మేవార్ రాణా తమరయ్యెదరు!

సగర-అదెట్లు? మేవాడ్ రాణా అమరసింహుఁడుకాడా?

అబ్దుల్లా-కాఁడు. నేటినుండియు మేవాడ్ రాణా మీరు. జహాం గీర్ పాదుషావారు మీకాయాధిపత్య మిచ్చిరి. ఇప్పుడే మీరు చిత్తూరునకుఁబోవలయును.

సగర—ఏల?

అబ్దుల్లా-అది మీ రాజధాని.

సగర—అప్పుడు అమరసింహుని రాజధాని యేదగును? ఉదయపురమా?

అబ్దుల్లా-ఆతఁడింక రాణాకాఁడు. పాదుషావారాతని సింహాసనమునుండి తొలఁగించిరి.

సగర—ఆతఁడు సింహాసనమును విడచునా?

అబ్దుల్లా-బలవంతముగ నీవల కీడ్చివైచిన విడునకేమిచేయును?

సగర-ఏమీ! అట్లయిన నేనుపోయి యాతనితోఁబోరాడ వలయునన్నమాట! వలదు. వలదు. నాకు మేవాడరాణా

పదవి యవసరము లేదు.

అరుణ-ఏమి తాతా! ఇప్పుడిప్పుడేకదా చెప్పియుంటిరి బాగుగా పోరాడగలనని! పోయి యమరసింహునితోఁ బోరా డుఁడు.

సగర-(చీకాకుతో) ఊరకుండుము. నిన్నెవ్వరును చెప్పుమన లేదు. (అబ్దుల్లాతో) లేదు, సయ్యద్ సాహెబ్! నేను యుద్ధముచేయజాలను. కావుననే నేను మీపక్షముఁ జేరితిని. యుద్ధముచేయగలిగితినేని స్వదేశమునకై పో రుటమాని నేను శత్రుపక్షమునేల చేరుదును.

అబ్దుల్లా-రాజాసాహెబ్! మీరు యుద్ధముచేయ నవసరము లేదు. అవసరముకలిగిన మేము యుద్ధముచేయుదుము రాణాపదవిని స్వీకరించి చిత్తూరునకుఁ బయనముకండు

సగర—ఒకవేళ అమరసింహుఁడు చిత్తూరుపై దాడివచ్చిన?— అప్పుడు నాకేమిగతి?—వలదు! వలదు! క్షమించుఁడు. నాకా రాణాపదవి వలదు.

అబ్దుల్లా-అట్లయిన, ఇప్పుడేపోయి పాదుషావారితోఁ జెప్పు కొనుఁడు

సగర—మంచిది. కానిండు మీరందరును నన్నవమానముచేయు టకుఁ జూచుచున్నారు—వలదు. నాకా రాణాపదవి వలదు—ఇప్పుడేపోయి చెప్పెదను—అరుణా, రమ్ము

(నిష్క్రమింతురు)



## దృశ్యము 2.

స్థానము:—ఉదయపుర రాజభవనము—మానసి గది.

[మానసి కూర్చుండి పాడుకొనుచుండును. కొంతసేపైన పిమ్మట అజయసింహుఁడు ప్రవేశించును.]



మానసి-(పాటచాలించి) అజయా! ఇన్నిదినములనుండియు నీ దర్శనమే నాకు కఱవయ్యెనేమి? నీ శరీరమునందు స్వస్థతగా నుండుట లేదా?

అజయా—లేదు—నీ విచ్చట నొంటరిగా నుంటివేల?

మానసి-నేను పాడుకొనుచుంటిని. సంగీతమునందలి పరమానందము ననుభవించుచుంటిని.

అజయ—మానసీ! నీవు ధన్యురాలవు!—కాని, నీ ముఖమునందు చింతా సూచకములగు చిహ్నములు కానవచ్చుచున్నవి! కారణమేమి?

మానసి—ఔను, అజయా! నేను చింతించుచుంటిని.

అజయ—దేనివిషయమై?

మానసి—ప్రపంచమున మానవుఁడు కేవలము దీనుఁడనియును నిస్సహాయుఁడనియును చింతించుచుంటిని. దేవార్ యుద్ధమున నేను నేర్చుకొనిన నీతిపాఠమిదియే! ఆహా!

తే॥ గీ॥ మృత్యువున నస్వమేక మం । చెఱిఁగి యెఱిఁగి
బ్రతికి నంతకాలము పర । స్పర విరోధ

మానసమునం దామసమున । మడయునట్టి
మనము దానవులముగాక । మానవులమె?

అజయ—నిశ్చయము—కాని, మానసీ! నీముఖమండలమునందు నాకు నేఁడెట్టి రమణీయజ్యోతి దృగ్గోచరమగుచున్నది! తిరిగి యానాటిరాత్రి నాకు స్మరణకు వచ్చుచున్నది!

మానసి-ఏనాటిరాత్రి?

అజయ—ఆనాఁడు దేవార్ యుద్ధక్షేత్రమున, ఆ నిబిడాంధకారమున, సేవాదీక్షఁబూని, చేత దీపముబట్టి, రణనిహతులైన సైనికులనడుమ దిరిమ్మరుచు, మూర్తీభవించిన దయాగుణమువలె నీవు నాకుఁ బొడగట్టితివి! ఆహా! ఎట్టి మహోజ్వలతేజము నీముఖబింబముపై నప్పుడు తాండవమాడుచుండెను! నిన్నుఁజూచినంతనే నాహృదయాంతర్గతమై యుండిన ప్రేమభావము నిరాశ నిశ్వాసమునఁ గలసిపోయినది!

మానసి—అజయా! నిరాశయేల?

అజయ—చెప్పుమనెదవా? నిన్ను వివాహమాడి సాంసారిక బంధనములచే నిన్ను బంధింప యత్నించుట యసంభవమని నేను గ్రహించితిని. ఏమందువా?

తే॥ గీ॥ వనజనయన! నీవొక నరాం । గనవుకావు,
స్వర్గవాసినియైన దే । వతవుకాని!
నీహృదంతరోద్గత తీవ్ర । నిబిడ తేజ
మీ ప్రపంచగోళంబు సహింపఁగలదె?

నీయంతరాత్మయనెడు దివ్యజ్యోతిని దాచియుంచుట కీశ్వరుఁడు నీ శరీరమును నిర్మించెను. ఆకాశము నీకు రంగస్థలము! నక్షత్రములు నీ సహచారిణులు. చంద్రికాంతి నిర్మల సంగీతము. ఈమహానాటకమునకు నాయికవు నీవు! నేను నిన్ను ప్రేమించుట కనర్హుఁడను. నేను నీకు భక్తుఁడన య్యెదను. నా భక్తికి ప్రతిఫలముగ నీకరుణామృతబిందు వొక్కటిమాత్రము నే నర్థించుచున్నాను! మానసీ! నాప్రార్థన మంగీకరింతువా!

(అజయసింహుఁడు మానసిచేయిఁ బట్టుకొనును. ఇంతలో రాణి రుక్మిణి ప్రవేశించును)

రాణి—అజయసింగ్! (తీవ్రముగఁ జూచును)

మానసి—ఏమమ్మా?

రాణి—అజయా! ఈవిధముగ నీవేకాంతమున నాపుత్రికతో మాటాడవలదు.

అజయ-మహారాణీ! నన్ను క్షమింపుఁడు.

మానసి-అజయా! క్షమించుటేల?

రాణి—(మానసి నుద్దేశించి, కొంచెము కోపముతో నీవు రాజకన్యకవని జ్ఞప్తియుంచుకొనుము. లోనికిఁబొమ్ము.

మానసి—(తలవంచుకొని) నిష్క్రమించును)

రాణి-అజయా, నీవు గోవిందసింగ్ పుత్త్రుఁడవు. నిన్ను మేమందరమును మాకుటుంబములోని వానివలెనే భావించుచుందుము. కాని, నీవొక విషయముమాత్రము

మఱువఁదగదు. మానసి యువతి. నీవు యువకుఁడవు.
ఇట్టిస్థితిలో నీవు మానసితోఁజనవుగ మాటాడుట
నాకిష్టము లేదు.

అజయ-చిత్తము. నా యజ్ఞానమును క్షమించుఁడు

(నమస్కరించి నిష్క్రమించును).

రాణి-(తనలో) నా కిప్పుడంతయును దెలిసినది. ఈవిషయము నే
నాటినుండియును శంకించుచు నే యుంటిని.

(రాణా అమరసింగ్ ప్రవేశించును)

రాణి-ప్రభూ! నేనిప్పుడే తమయొద్దకు రాఁదలచుచుంటిని.
అమర-(పరధ్యానముగ) నీవు మానసి నేమైన ననియుంటివా?
రాణి-లేదే! ఏమి? ఏమైనది?
అమర-ఆమె యేడ్చుచున్నది.
రాణి-ఏడ్చుచున్నదా? ఏమి? అంతదుఃఖకరమగుమాట నేనే
మంటిని? మీరు మానసివిషయమున కొంచెమేనియు
శ్రద్ధఁదీసికొనకున్నారు. గడియక్రిందట నజయసింహుని-
అమర-ఇదిగో, జాగ్రత! మానసి విషయమునఁ గొంచెము
దూరాలోచన గలిగి ప్రవర్తింపుము. ఆమె యెవరో
నీకుఁదెలియునా?
రాణి-(విస్మయముతో) ఎవరు?
అమర-ఆమె కేవలమొక మానుషవ్యక్తి యని భావింపకుము.
స్వర్గమునందలి యొకానొక దివ్యజ్యోతి పృథ్విపై వ్రా

లిసది. నీవేమేని యన్నచో, ఆజ్యోతి తిరిగి స్వర్గమునకు
మఱలిపోవును. తెలిసినదా? పొమ్ము. ఆమె యెందుల
కేడ్చుచున్నదో చూడుము.

రాణి-(తలవంచుకొని నిష్క్రమించును)

అమర—(కూర్చుండి, కొంతతడవూరకుండి) ఈ జీవనము కేవల
మొకస్వప్నము. సముద్రము నందువలె దీనియందు
చిత్రవిచిత్రములగు తరంగములు లేచుచుఁ గుంగు
చుండును. ఆహా!

తే॥ గీ॥ అక్షయ విలాస నిధియై క్ష ౹ ణక్షణంబు
బ్రిబల పరివర్తసముఁగాంచు ౹ ప్రకృతివోలె,
చంచలంబైన సంసార ౹ జలధిలోన
నావయాత్ర కదా, నరు ౹ జీవయాత్ర!

(ప్రవేశము—గోవిందసింగ్)

అమర—(తిరిగిచూచి) గోవిందసింగ్! ఏ శేషములేమి?

గోవిం-ప్రభూ! మొగల్ సైన్యములు తిరిగి మేవార్ పై దండు
విడియుచున్నవి.

అమర—విడియనిమ్ము—. దేవార్ యుద్ధముతో మనకును వారి
కిని వైరము పరిసమాప్తి కాలేదని నాకు మొదటి
నుండియును దెలియును. రాజస్థానమంతయు నిర్మాను
ష్యమగువఱకు మొగలాయీలకు శాంతియుండదు.

గోవిం—రాణాజీ! ఇంకను మనపక్షమున నెట్టిప్రయత్నముఁ
గావించుటకును అనుజ్ఞనీయరేమి?

అమర-ఏల? ప్రయత్నమున కావశ్యకత యేమున్నది.

గోవిం-ఏమి! ఈసారి మీరు యుద్ధముం జేయఁదలచుకొనలేదా?

అమర-యుద్ధమేల? యుద్ధమువలనఁ బ్రయోజనమేమి?

గోవిం-అట్లయిన అప్రయత్నముగనే మ్లేచ్ఛులు మేవాడపై రాజ్యాధికారముఁ జేయుదురు.

అమర-చేయనిమ్ము. ఇంక నేను వారితో యుద్ధముఁ జేయ దలచుకొనలేదు.

గోవిం-ఎట్టిప్రయత్నమును గావింపకనే—

అమర-గోవిందసింగ్! ఈమాటలవలనఁ బ్రయోజనము లేదు. ఇదియంతయును వ్యర్థమని నాకుఁ దెలియును. దేవాక్ యుద్ధభూమిపై మనసైన్యమునం దర్ధభాగము నశించినది. ఇంకను పోరుసాగించుటకు మనకు సైన్యమెచ్చట నున్నది?

(ప్రవేశము—సత్యవతి)

సత్య-(గంభీరముగ) భూగర్భమును భేదించుకొని సైన్యము రాఁగలదు. మహారాజా! సైన్యమునుగూర్చి మీరు చింతింపవలదు.

అమర-(స్తంభితుఁడై) ఎవరు?—చారణీ!

సత్య-ఔను, మహారాజా! ఆనాటి చారణినే నేను! మొగలాయి సైన్యములు తిరిగి మేవాడపై దండయాత్రసాగింప నున్నవని విని మీకు రణోత్సాహముఁ గలిగింపవచ్చితిని

అమర-చారణీ! యుద్ధముఁజేయుటకు నాకిచ్ఛలేదు. ఈసారి

నేను వారితో సంధిఁగావించుకొనెదను.

సత్య-(గంభీరముగ) సంధియా? మహారాజా! సంధిఁగావించుకొనెదరా? దేవార్ యుద్ధమున విజయలక్ష్మిని జేపట్టియును, ఇప్పుడు సంధియా మీరపేక్షించునది? యశశ్శిఖరాగ్రమునుండి యొక్కసారి యగాధమగు నవమాన కూపమునందుఁ బడుటకే నిశ్చయించితిరా? దేవార్ సంగ్రామవిజయమున కర్థములేదా?

అక్బర-చారణీ! దేవార్ యుద్ధమున నవశ్యము నేనే జయించితిని!. కాని, ఆ విజయ మెట్లు చేకూరెనో నీకుఁదెలియునా? నాసైన్యమునం దర్థభాగము నశించినది. అసంఖ్యాకులగు రసపుత్రవీరుల రక్తము రణభూమిపైఁ బ్రవహించినది. నేను జయించితిని! ప్రయోజనమేమి?

సత్య—మహారాజా! అదియొక విషాదకరమగు విషయముకాదే! ఒకానొకజాతిని పవిత్రీభూత మొనర్చినది యాజాతి వీరుల రక్తస్రావమే యని ధృఢముగ నమ్మియుండుఁడు!

ఆ॥ వె॥ వీరహృదయరక్త ధారలు పాఱని
భూమి యొక శ్మశాన భూమి కాదె?
వీర నిహతిలేక పృథ్వీస్థలిని నే ప్ర
సిద్ధ దేశమేని వృద్ధిఁగనెనె?

ఏదేశమున వీరుల రక్తము స్రవించునో యాదేశమునకై చింతింపరాదు. ఏదేశమున వీరులరక్తము ప్రవించదో యాదేశమునకై మనము చింతింప వలయును.

అమర-కాని, తిరిగి మరియొక యుద్ధమొనర్చుటవలన ఫలము లేదని నా యభిప్రాయము. నామమాత్రికమైన సైన్యముతో నసంఖ్యాకమగు మొగలాయిసైన్యము నెదుర్కొనుట కేవలము పిచ్చియని నా యుద్దేశము.

సత్య—మహారాజా! ఇదియే పిచ్చియైనచో ఈ ప్రపంచము నందెట్టి వ్యక్తియు నెట్టి ఘనకార్యమును జేసియుండదు. ప్రపంచమంతయు నీ పిచ్చియొక్క పాదములపై శిరముంచి మ్రొక్కుచున్నదని గ్రహింపుడు.

అమర-కాని, యీయుద్ధమునకుఁబరిణామము నిశ్చితమృత్యువు.

సత్య-ప్రభూ!ఏదియుత్తమము?పరాధీనతయా?లేకమృత్యువా? లోకాదర్శకుఁడైన శ్రీ ప్రతాపసింహుని యాత్మసంభవులగు మీకు నేను విశదీకరింపవలసిన యవసరము లేదు. అమూల్యరత్నకోటికంటెఁ బ్రియతరమగు మన మాతృభూమిని శతసహస్ర రసపుత్ర వీర రక్త పరిషిక్తమైన యీరాజ్యమును, కేవలము మృత్యువునకు భీతిల్లి యప్రయత్నముగ విదేశీయుల కప్పగించెదమా?

ఉ॥ చావక తప్పునే జగతి । జన్మముఁగాంచిన యెట్టిప్రాణియున్
జావునకేల భీతిలెదు? । క్షాత్రకులంబునఁ బుట్టి యుండియున్
భూవర! లెమ్ము, లెమ్ము! ధృతిఁ । బూనుము! ఖడ్గముఁబూని దేశమున్
బ్రోవగ రమ్ము! రమ్ము రణ । భూమికిఁ దోడుగ నేనువచ్చెదన్!

అమర-చారణీ! నీ వెవ్వతవు? నీ వాక్యములయందు మేఘ

గర్జనమును, నీ నేత్రములందు విద్యుల్లతయును, నీ సర్వాంగములయందును బ్రచండమారుతమును నాకు బొడఁగట్టుచున్నవి. సూర్యునివలె మహోజ్జ్వలవై, జలప్రపాతమువలె నిరంకుశవై, వజ్రపాతమువలె భీషణాకారిణివై యున్న నీ వెవ్వరవుతల్లీ?

సత్య—రాజేంద్రా! మరల మరలఁ బ్రశ్నించుచుంటిరి కావునఁ జెప్పకఁ దప్పదు. ఇప్పుడు నేను ప్రచ్ఛన్నముగానుండు నావశ్యకతయు లేదు. చెప్పెదను వినుఁడు.

గీ॥ నీకుఁదండ్రియై, సర్వలో । కైకపూజ్యుఁ
డైనయట్టి పరితాపసిం । హంబునకును
తగని సోదరుఁడైనట్టి । సగరసింహు
తనయ నేను, నిర్భాగ్య స । త్యవతిననఘ!

అమర-(విస్మయముతో) ఏమీ! ఏమీ! నీవు సగరసింహుని పుత్రిక యగు సత్యవతివా?

సత్య-సోదరా! అట్లు చెప్పుకొనుటకు నాకు సిగ్గు పొడము చున్నది. నాతండ్రి మ్లేచ్ఛదాసుఁడై యధమాధమ జీవనముఁ గడపుచున్నాఁడు. ఆతని పాపములకు వలయు ప్రాయశ్చిత్తము నేను గావించుటకు సిద్ధముగనున్నాను ఆతఁడిప్పుడు తన సోదరుని కుమారుఁడవగు నిన్నుఁ బదభ్రష్టునిఁ జేయుటకై మొగలాయీలచే నామ మాత్రకముగ మేవాడరాణా చేయఁబడినాఁడు! ఆతని కుమార్తెనైనను నేను ఆతనికి విరుద్ధముగ మేవాడ

వాసుల కుద్బోధించుచు చారణీవేషమున దిరిగుచుంటిని. అమరసింహా! నా యుద్బోధనములే కారణముగ నేటివఱకును మేవాడ ప్రజలెవ్వరును నూతన కల్పిత ప్రభువగు నాతండ్రికి ఒక కాసైనను కప్పముఁ జెల్లించి యుండలేదను విషయము నీకుఁ దెలిసియే యుండును!

అమర-ఔను సోదరీ! ఆవిషయము! నాకుఁదెలియును.

సత్య-సోదరా! మేవాడ దీనావస్థ నవలోకించి నేను నా భాగ్య భోగములను, బంధుమిత్రులను సమస్తమును బరిత్యజించి, యీ చారణీవేషమున, మేవాడ కీర్తిగీతములను బాడుకొనుచు నీరాజ్యమునందలి పర్వతారణ్యమార్గముల సంచరించు చుందును. అట్టి నా ప్రాణాధికమగు మేవాడ భూమిని అప్రయత్నముగ నీవు శత్రుగతము జేయుదువా?

(కన్నీరుఁ దుడుచుకొనును)

అమర-సోదరీ! దుఃఖింపకుము. నిద్రాగతుఁడనై యున్న నాకు నీవు మెలకువఁ దెచ్చితివి.

ఉ॥ ఏరమణీయ భూమికయి ♦ యీవు సమస్తము వీడి, యీగతిన్
చారణివై భయంకర వ ♦ నస్థలులందుఁ జరించుచుంటివో,
ఆ రమణీయ రాజ్యరమ ♦ కాత్మ విభుండను నేను, దానికై
వారిజనేత్ర! హర్షమునఁ ♦ బ్రాణములేనియు ధారపోయనే?

గోవిందసింగ్! నేను యుద్ధముఁజేయుటకే నిశ్చయించుకొంటిని! సైన్యము సిద్ధముఁజేయుము.

గోవిం-
సత్య- } (సంతోషముతో) జై మేవార్ మహారాణాకుజై!

(తెరజాఱును.)



## దృశ్యము 3.

స్థానము:—ఉదయపురమునందలి రాజమందిరము—మానసిగది.

[మానసి, గోవిందసింగ్ పుత్రి కల్యాణి, మాటలాడుచుందురు]



మానసి-కల్యాణీ! ఇచ్చట నేనొక చికిత్సాలయమును స్థాపించితిని, అచ్చటికనేకులు కుష్ఠురోగులు వచ్చియున్నారు. ఇంకను వచ్చుచున్నారు. పాపము! వారెంత దుఃఖితులు కల్యాణీ!

కల్యాణి-నిశ్చయము. మానసీ! వారి దుఃఖోపశమనమునకై పాటుఁబడుచున్న నీ జీవనము ధన్యమైనది.

మానసి-ప్రశంసింపుము. కల్యాణీ! ప్రశంసింపుము. నాకుత్సాహమొసంగుము. నా హృదయమునకు బలముఁ జేకూర్పుము.

కల్యాణి- ఈ పవిత్రకార్యమున నిన్నెవ్వరు నిరోధించుటలేదు కదా?

మానసి- లేదు. తండ్రిగారేమియు నడ్డుపెట్టుట లేదు. కాని, ప్రజలుమాత్రము, "రాజకుమారి యిట్లు చేయుట యేమియు శోభస్కరముగ లేదు" అని యనుచుందురు. రాజకుమారియైనచో సౌఖ్యపడ నావశ్యకత లేదేమో!

(నవ్వును)

కల్యాణి-మానసీ! నీ ప్రయత్నమునందు నీకు సౌఖ్యము చేకూరుచున్నదా?

మానసి-(చిరునవ్వుతో) కల్యాణీ! ఇతరులకు సౌఖ్యమొన గూర్చుటయందు మనమనుభవించు సౌఖ్యము నిరుప మానము! కాని, యీ మానవజాతికి సౌఖ్యము సమ కూర్ప యత్నించుట కేవలము వ్యర్థమనియే తోచు చున్నది. ఘాతుక జంతువులవలెఁ దనసంతానమును తానేమ్రింగు పాపిష్ఠజాతి యీ మానవసంఘము!

కల్యాణి-నాసోదరుఁడు అజయసింహుఁడుసహిత మిట్లేయను చుండును. ఆతఁడు నీకు శిష్యుఁడుకాఁడా? నీనామమే యాతఁడు సదాజపించు చుండును.

మానసి-ఆతఁడేల రాలేదు? ఒక్కసారి యాతని నాయొద్దకు రమ్మని చెప్పుము. చూడవలయునని యున్నది.

(దాసి ప్రవేశించును)

దాసి—అమ్మా! ఒకచిత్రకారిణివచ్చి గుమ్మముకడ వేచియున్నది

మానసి-చిత్రకారిణియా? ఆమె చిత్రపటము లమ్మునా?

దాసి—అమ్ముచున్నది.

మానసి—మంచిది. ఆమెనిచ్చటకుఁదోడ్కొని రమ్ము.

దాసి—చిత్తము. (నిష్క్రమించును)

మానసి-కల్యాణీ! అజయసింహుఁడు దినమంతయు నేమిచేయుచుండును.

కల్యా—అతఁడింటియొద్దఁ జాల కాలముండఁడు. ఇంటికివచ్చిన తోడనే యడిగినచో, "రోగులకు సేవఁజేయుటకుఁ బోయియుంటిని. దుఃఖితులకు ధైర్యముఁగొల్పుటకుఁ జనియుంటిని" అని చెప్పుచుండును.

(చిత్రకారిణి ప్రవేశించును.)

మానసి-నీవు చిత్రపటము లమ్మెదవా?

చిత్రి—ఔను తల్లీ!

మానసి-కొంచెము చూచెదను. నీయొద్ద నేమేమి చిత్రములున్నవో చూపుము.

చిత్రి—చిత్తము. (మూటవిప్పుచుండును)

మానసి-నీ నివాస మెచ్చట?

చిత్రి—ఆగ్రా, తల్లీ!

మానసి—ఇంతదూరము చిత్రముల నమ్ముటకు వచ్చితివా?

చిత్రి-ఔను తల్లీ! ఈ పనిమీఁద మేమెంత దూరమైనఁ బోవుచుందుము.

మానసి-(మూటలోని యొకపటముఁదీసి) ఈపట మెవ్వరిది?

చిత్రి-ఇది యక్బర్ పాదుషావారిది తల్లీ!

కల్యా—అక్బర్ పాదుషావారిదా? తెమ్ము చూచెదను. (మానసి చేతిలోని పటముఁదీసికొని) ఓహో! ఎట్టి తీవ్రదృష్టి! ఎట్టి తీవ్రదృష్టి!

మానసి-(వంగి పటమువైపుఁజూచుచు) కాని, యీ ముఖ మండలమున, స్నేహము, దయ, హితము కాన్పించుచున్నవి!—(మఱియొక పటముదీసి) ఇదియెవ్వరి పటము?

చిత్రి—ఇదియా, తల్లీ? ఇది మహారాజా మానసింహునిది.

కల్యా—(ఆపటమువైపుఁజూచుచు) ఈతని ముఖమున విషాదమును, నిరాశయును ముద్రితములై యున్నవి!

మానసి-(నిదానించుచు) ఔను. ముఖము చింతావృతమై కన్పట్టుచున్నది? కాని, అందుఁగొంచెము ఆత్మగౌరవము సహితము మిళితమై యున్నది. (మఱియొక పటముదీసి) ఇదియెవ్వరిది?

చిత్ర—ఏదీ?—అది జహంగీర్ పాదుషావారిది.

కల్యా-(చూచి) ఓహో! ఆముఖమునందెట్టి దంభగుణము ప్రకటిత మగుచున్నది!

మానసి-(నిదానించి) దృఢప్రతిజ్ఞ యును గన్పట్టుచున్నది. (మరియొక పటముఁదీసి) ఇది యెవ్వరిది?

చిత్ర—ఏది తల్లీ? అదియా? అది మొగల్ సేనాపతి హిదాయత్ ఆలీఖాన్‌వారిది. చూడుఁడు తల్లీ, యెట్టి సుందర మూర్తియో?

మానసి.-(కొంతసేపుచూచి పకపక నవ్వును).

కల్యా-మానసీ! నవ్వుచుంటివేల?

మానసి-చూచుటలేదా కల్యాణీ! ఈతఁడెట్టి మూర్ఖుఁడో చూడుము. ఆ ముఖమునందుఁ బ్రకటితమగుచున్న భావమును చూడుము. సొగసుఁగూర్చ దువ్వుకొనిన యుంగరపు వెండ్రుకలు, నడిమిపాపట, పౌరుషహీనమై వెలయు ముఖము!—కల్యాణీ! చూడుము. ఈతఁడొక మూర్ఖునివలె, అహంకారివలెఁ దోచుటలేదా?-(ఆపటము క్రిందఁబెట్టి మఱియొకటితీసి) చిత్రకారిణీ! ఈతఁడెవ్వఁడో

చిత్రి—ఆతఁడు మహాబత్ఖాన్‌సాహెబ్!

మానసి-మొగల్‌సేనాపతి మహాబత్ఖానా? (నిదానించి) ముఖమునం దెట్టి తేజము! ఎట్టి దృఢసంకల్పము! ఎట్టి యౌదార్యము! ఎట్టి యాత్మాభిమానము! ఈగుణములన్నియు నొకేసారి యొక్క వ్యక్తియందు సమ్మిళితములై యుండుట యసంభవము! కల్యాణీ! తదేకధ్యానముగ నేమి చూచుచుంటివి?

కల్యా-(తలవంచుకొని) ఏమియును లేదు.

మానసి-(చిత్రకారిణితో) ఇంకను మిగిలియున్న చిత్తరువు లెవ్వరివి?

చిత్రి—పాదుషావారి దర్బారులోని వారివి.

మానసి-మంచిది. నేను, అక్బర్, మానసింహుఁడు, జహాంగీర్ మహాబత్ఖాన్, వీరి పటములను దీసికొందును. వీని

విలువ యెంత?

చిత్రి—మీయనుగ్రహము తల్లీ!

మానసి-(నాల్గు మొహరులనిచ్చి) వీనినిఁ దీసికొనుము.

చిత్రి-(మొహరులపైఁ జూచుచు) ఈ మొహిరీలపై రాణా అమరసింహునిమూర్తి ముద్రితమైయున్న దా?

మానసి—ఔను.

చిత్రి-ఇందు మీచిత్తరువున్నట్లు కానరాదు.

మానసి-లేదు. అందు నాచిత్తరు వేల యుండును? నాకు చిత్తరువే లేదు.

చిత్రి-ఆజ్ఞాపించినచో మీచిత్రపటమును వ్రాసియిచ్చెదనుతల్లీ

మానసి-నాచిత్రపటమా?—వలదు.

చిత్రి—ఇందు నష్టమేమి తల్లీ?

మానసి—నష్టమున్నది. చిత్రకారిణీ! నీవింకఁ బోవచ్చును.

చిత్రి—చిత్తము. దయయుంచుఁడు. (నిష్క్రమించును.)

మానసి-కల్యాణీ! తదేకధ్యానముగ నీ వెవ్వరిమూర్తిని జూచుచున్నావు?

కల్యా—ఎవ్వరిదియుఁ జూచుట లేదు.

మానసి-సిగ్గుపడుచుంటివేల? నీవు చూచుచుండిన చిత్తరువును నేను తీసెదను చూడుము. (మహబత్ఖాన్ పటముఁదీసి) ఇదిగో చూడుము. కల్యాణీ! చూడుము. నీవు సిగ్గుపడుచుంటివేల? మహబత్ఖాన్ నీకు భర్త కదా?

కల్యా-కాని, కులద్రోహి! విధర్మి—

మానసి ఏమంటివి? విధర్మియా? కల్యాణీ! ధర్మములెన్ని?

తే॥ గీ॥ వసుధఁగలయట్టి బహువిధ ప్రాణితతికి
ప్రభవ కారణుఁడొక్క యీ శ్వరుఁడు కాఁడె?
అట్లె, బ్రహ్మాండమునఁగల యఖిల ధర్మ
తతికి నాది కారణమైన ధర్మమొకటె!

ఈ సత్యమును గ్రహింపనేరక, మానవకోటియన్యోన్య విద్వేషమను భయానకాగ్ని కాహుతియై పోవుచున్నది! జాతి మత విభేదము లను దావాగ్నియందుఁబడి మలమల మాడి పోవుచున్నది. కల్యాణీ! ప్రపంచమున ధర్మముపేరిట జరుగుచున్న రక్తపాతము వేఱొక హేతువుచే జరుగుట లేదుసుమా!

కల్యా—కాని, మానసీ! అతని నేనింకను ప్రేమించుట పాపము కాదా?

మానసి—ప్రేమించుట పాపమా? కల్యాణీ! కుత్సితునిఁ బ్రేమించుటే పుణ్యము! ఇంతకును, మహబత్ఖాన్ విధర్మి యెట్లగును? హిందూమతమును బరిత్యజించి ముసల్మానుఁడైనంత మాత్రమున దోషియగునా? ఈశ్వరుని "బ్రహ్మ" యని పిలువక "అల్లా" అని పిలచినంత మాత్రమున పాపియగునా?

కల్యా—మానసీ! నా యజ్ఞానమును క్షమింపుము. నేటినుండి యును నీవునాకు గురుదేవతవు.

మానసి—కల్యాణీ! ప్రేమయన నెట్టిదియో నీకుఁదెలియునా? అది యొక నిష్కళంకమగు దివ్యజ్యోతి!

సీ॥ ఇతఁడు వృద్ధ కుమారి ౹ యితఁడు యౌవనుఁడన్న
తత్కాల రూప భే ౹ దంబు లేదు!
ఇతఁడు ముసల్మానుఁ ౹ డితఁడు హిందువుఁడన్న
తద్బాహ్య జాతి భే ౹ దంబు లేదు!
ఇతఁడు మహాభోగి ౹ యితఁడు దుఃఖితుఁడన్న
తత్ప్రాప్త భాగ్య భే ౹ దంబు లేదు!
ఈతఁడు చండాలుఁ ౹ డితఁడు ఛాందసుఁడన్న
తద్ వ్యవస్థా విభే ౹ దంబు లేదు!

గీ॥ వంచనము లేదు! స్వార్థ త ♦ త్పరత లేదు
లేదు విద్వేష భావంబు! ♦ లేదు చింత!
సర్వ మేకంబు సర్వ మీ ♦ శ్వర మయంబు!-
ఇందు ముఖి! ప్రేమ సామ్రాజ్య ♦ మిందునందు!

కల్యా-(విస్మితయై) రాజకుమారీ! నీ హృదయోద్గత మగుచున్న మహోజ్వల తేజమును భరించుటకు నాకు శక్తి చాల కున్నది! నాకు సెలవొసంగుము. అనుమతియైనచోఁ దిరిగి రేపు వచ్చెదను. (లేచును)

మానసి—మంచిది. అట్లనే కానిమ్ము. కాని రేపు తప్పక రావల యునుసుమా! అజయసింహునిఁగూడ రమ్మనుము.

కల్యా—మంచిది. (మహబత్ఖాన్ పటముతో నిష్క్రమించును)

(రాణి రుక్మిణి ప్రవేశించును)

రాణి—మానసీ!

మానసి-ఏమమ్మా?

రాణి— మీ నాయనగారు పిలచుచున్నారు.
మానసి-ఎందులకు?
రాణి-నీతో కొంచెము మాటాడవలసి యున్నదట! నీ వివాహ
ముసకై శుభదినము నిశ్చయించుచున్నారు.
మానసి-నా వివాహమా?
రాణి-ఔను. జోధ్పూర్ రాజకుమారుఁడగు జస్వంతసింహు
నితో నీకు వివాహము నిశ్చయమైనది. శుభముహూ
ర్తము నిర్ణయించుటకై జోధ్పూరునకు దూతనుబంపిరి.
మానసి-(దుఃఖ ముఖినయి చూచును)
రాణి-ఇదేమి మానసీ! ఏడ్చుచుంటివేల?
మానసి-లేదమ్మా!నాకు వివాహము వలదు.
రాణి-వివాహమే వలదా?
మానసి-వలదు. సాంసారిక బాధములచే నేను నాజీవనమును
బంధింప నిచ్ఛగింపను.
రాణి-ఇదేమి మానసీ? బ్రతుకునంతకాలమును బ్రహ్మచారిణివై
యుందువా?
మానసి-ఏల యుండఁజాలను?

తే॥ గీ॥ బాల్యమాది వైధవ్య సం • ప్రాప్తమునను
బ్రహ్మచారిణులైన జ • వ్వనులు లేరె?
అట్టిచో వ్రతధారిణి • నైన నేను
బ్రహ్మచారిణినై ధాత్రి • బ్రతుక లేనె?

నాకు వివాహము వలదు. నేనవివాహితనై యే యుం

దను. ఇప్పుడేపోయి నాయనగారికి నాయుద్దేశమును దెలియ
జేసెదను. (నిష్క్రమించును)

రాణి-(స్వగతము) ఇదియేమి? ఈమెకుఁ బిచ్చిపట్టలేదు కదా?
పిచ్చికాకున్న మఱియేమి? నాకు మొదటినుండియు
నీమె విషయమున భయమగుచునే యుండెను. అదిగో
రాణావారు వచ్చుచున్నారు.

(ప్రవేశము-రాణాఅమరసింహుఁడు)

అమర—మానసి యెచ్చట నున్నది?

రాణి—ఆమె మీయొద్దకు రాలేదా? ఆమె కేదియో పిచ్చిపట్టి
నట్లు తోఁచుచున్నది!

అమర—పిచ్చియా?

రాణి-కాకున్న మరేమి? వివాహ మక్కఱలేదనుచున్నది.
అవివాహితమై జీవితకాలమంతయుఁగడపునట. ఆమెకు
గొంచెము భయముంచుఁడని నేను మొదటనుండియును
మొఱఁబెట్టుకొనుచునే యుంటిని. కాని, మీరువినరైరి.

అమర-మంచిది. నీకేమియుఁ దెలియదని యిప్పటికి స్పష్టమైనది

రాణి—తెలియ కేమి? బాగుగఁదెలియును. ఆమెకు నిశ్చయముగ
నేదో పిచ్చి పట్టినది.

అమర—ఆపిచ్చి నీకేపట్టినచో నిన్ను నేను స్వర్ణసింహాసనముపై
గూర్చుండఁబెట్టి పూజించి యుందును. కాంతా నేను
మానసి హృదయమును సంపూర్ణముగ నెఱుఁగుదును

ఆమె లోకాతీతమగు నొక దివ్యపదార్థమని తెలిసి కొనుము.

రాణి-ఆమె వివాహము?

అమర-వలదు. ఆవిషయమై నీవేమియు మాటలాడవలదు.

(నిష్క్రమించును.)

రాణి-(స్వగతము) సహజముగ నున్నది! మానసి యొక్క పిచ్చి పైతృకమని నాకిప్పుడు తెలిసినది. మునుముం పెట్టి యుపద్రవములు వాటిల్లునోకదా?

(మెల్లగ నిష్క్రమించును)



## దృశ్యము 4.

స్థానము:—గోవిందసింగ్ గృహము.



[గోడపై మహబత్ఖాన్ చిత్తరువు వ్రేలాడుచుండును. ఎదుట పుష్పగుచ్ఛమును చేతఁబూని గోవిందసింగ్ పుత్త్రి కల్యాణి నిలచి యుండును.]

కల్యా-నాహృదయేశ్వరా! యెంతకాలమునకుదిరిగి నీస్వరూప సందర్శనము నాకు లభించినది! పశ్చాత్తప్తనైన నేను తిరిగి యెంత కాలమునకు నీసౌందర్యమును జూడఁ గలుగుచున్నాను?

సీ॥ నవనవోజ్జ్వల మైన । నా యౌవన నికుంజ
వీథిఁ బాడుచునున్న । పికము వీవు!
అనయంబు విశ్వమో । హిని యైన ప్రకృతికాం
తను జూపు దివ్యాంజ । నంబ వీవు!
నా యకల్మష జీవ । నప్రభాతమునకు
నుదయార్క బింబము । యూఖి వీవు!
విమలమా నామనః । ప్రమదావనమునందుఁ
లక్షింపఁదగిన । గులాబి వీవు

గీ॥ ప్రభుఁడ వీవు నాదగుబహిః । ప్రాణమీవు
భాగ్యభోగంబవీవు దై । వంబ వీవు!
అఖిలమును నీవ! లేదునా । కన్యమిలను!
ప్రాణనాథ! గై కొనుమిదే । ప్రణతిశతము!

గోవి—(గంభీరముగ) కల్యాణీ!
కల్యా-(తిరిగి చూచి) ఏమితండ్రీ?
గోవిం-ఆపటమెవ్వరిది?
కల్యా-అది నాభర్తయొక్క చిత్తరువు.
గోవిం—నీభర్త యెవరు? మహాబత్ఖానా?
కల్యా—ఔను.
గోవిం-ఆ చిత్రము ఇచ్చటికెట్లు వచ్చినది?
కల్యా-నిత్యపూజకై నేనే యాపటమునుగొని తెచ్చుకొంటిని.
గోవిం-(కోపము నడచుకొనుచు) మంచిది మహాబత్ఖానునకు
క్షేమగును.

కల్యా—ఆతఁడు నాకుభర్త.

గోవిం—(గంభీరముగ) నీకు భర్తలేఁడని యీావఱకెన్నిసార్లు నీతోఁజెప్పియుంటిని?

కల్యా-నిన్నటి వఱకు నేను సహిత మిట్లే భావించి యుంటిని; కాని, నేఁడు ఆతఁడు నాపతి యని నిశ్చయముగ గుర్తించితిని.

గోవిం—(ఆగ్రహముతో) పతియా? కులద్రోహి, దేశద్రోహి దేశద్రోహి, విధర్మి మహాబత్ఖాన్ నీకుఁ బతియా?

కల్యా—తండ్రీ! నాకు ధర్మములు తెలియవు. ఆచారములు తెలియవు. నాకుఁ దెలిసిన దొక్కటియే. ఈశ్వరసాక్షిగ నా తనితో వివాహమైనది. ఆవైవాహిక బంధముచే మేమి రువురము నేకమైతిమి, ఇంక నేనా బంధనమునుండివిముక్తనగుట యెట్లు?

గోవిం-ఏమీా మహామ్మదీయ మతమును స్వీకరించిమహాబత్ఖాన్ స్వయముగ దన చేతులతోఁ దానాబంధనమును ఖండింపలేదా?

కల్యా—లేదు. మహమ్మదీయుఁడైనను ఆతఁడు నన్నుఁ బరిత్యజింపలేదు.

గోవిం—(కోపముతో) పరిత్యజింపలేదా? హిందూమతమును విసర్జించినన పిదప, గోవింద సింహుని కుమార్తెను,గ్రహించుటయుఁ బరిత్యజించుటయు వాని యిష్టానిష్టము ములపై నాధారపడియున్నదా! ఏనాఁడుమహాబత్ఖాన్

హిందూధర్మమును విడచెనో యానాఁడే నీప్రసహితము విడువఁ బడితివని, యెఱుఁగవలయును.

కల్యా-అట్లు కాదు తండ్రీ! ఆతఁడు నన్ను విడువలేదు.

గోవిం-ఏమనుచుంటివి? నిన్ను విడువలేదా! మంచిది:-నీవు మహాబత్ఖానున కేమేని లేఖ వ్రాసియుంటివా?

కల్యా-ఔను. వ్రాసియుంటిని.

(ప్రవేశము-అజయసింహుఁడు)

గోవిం-ఇదిగో ఆలేఖకు బ్రత్యుత్తరము దీని యందేమి వ్రాసియున్నదో యెఱుఁగుదువా? నిన్నాతఁడు పరిగ్రహింపజాలడట? ఇంతకంటె నీ కవమానము కావలయునా? ఇదిగో ఆపత్రము-

(పత్రము నామెపైకి విసరును కల్యాణి తీసి చూచుకొనును)

గోవిం-(అజయ సింహునితో) అజయా! మొగల్ సైన్యములు తిరిగి మేవాడపైఁ బడుచున్నవని వచ్చిన వృత్తాంతము సత్యమేనా?

అజయ-సత్యమే.

గోవిం-యీసారి మొగల్ సేనాపతి యెవరు?

అజయ-యువరాజు పర్వేజ్.

గోవిం-సైన్య మేమాత్రముండును?

అజయ-సుమారొక లక్షయుండునని తెలియుచున్నది.

గోవిం-(నిట్టూర్పు విడచి) అజయా! ఈ యుద్ధమునందు మేవార్ సర్వనాశనమగుట నిశ్చయము! మేవాడయంతు

నింగిలియున్న యీ రవంత వీరరక్తము సహిత మీ
యుద్ధభూమిపైఁ బ్రవహింపఁ గలదు. (కొంతసేపు తల
వంచుకొని యూరకుండి) ఏమికల్యాణీ! ఇంకను మహా
బత్ఖాన్ నీపతియనియే భావించుచుంటివా?

కల్యాణి-సందేహమేమి? అవశ్యమాతఁడు నాపతియే! తండ్రీ!
హిందూ సాంఘిక జీవనమున సత్యమననేమి? సాధ్వి
యన నెట్టిది?

ఉ॥ సర్వకృపాసలబ్దమగు, బాహులతాగ్రహమందు జొక్కుచున్
భర్తకు గౌరవంబొసఁగు, భామినియందు విశేషమున్నదే?
భర్తయనాదరంబునను, భంజనయయ్యు నహర్నిశంబులున్
భర్తనుపూజసేయు కుల, వర్ధనియే కదసాధ్విభూస్థలిన్.

మహాబత్ఖాన్ నాకుదైవము. ఆతఁడు తన చరణసేవకై
గైకొన్నను గైకొనకున్నను నాకు విచారములేదు. భర్తయొ
క్క యాదరణ తిరస్కారములు రెండును నాకుసమానములే.

గోవిం-(ఆగ్రహముతో) రెండును నీకు సమానములా?—
కల్యాణీ! నీవు నాకుఁబుత్రికవా?

కల్యా-ఔను తండ్రీ! నేను మీ పుత్రికను నేను మీ యాత్మ
గౌరవమునను సార్థకలుగఁజేయను. మీరెట్లు మాతృ
భూమికై జీవనోత్సర్గముఁగావించిరో యట్లే నేను సహి
తము నాభర్తనిమిత్తము మహానందమయమగు నుత్స
ర్గ పథమునఁ జనుచున్నాను. ఇందునాదోషమేమి?

గోవిం-ఉత్సర్గమా? నీవిలాసప్రవృత్తిని ఉత్సర్గమనుచుంటివా

అజయ—తండ్రీ! కోపావేశమున మీరేమనుచుంటిరో మీకుదె లియకున్నది. లోకోత్తరమైన కల్యాణి సతీత్వచింత మీకుఁగులటాపరివృత్తివలెదోచినదా?

గోవిం-అజయా! కల్యాణికి బతియే లేడని వేయిసార్లు చెప్పి యుంటిని. ఇంక నీమెకు సతీత్వ మెక్కడ? ఈమె విధన యైనది!

కల్యా-ఈ జన్మమునందును, జన్మాంతరమునందును సహితమా తఁడే నాపతియని నేను సహితము వేయి సార్లుచెప్పి దను. తండ్రీ!నాభర్తహిందువుఁడైనను ముసల్మానుఁడై నను ఆస్తికుఁడైనను, నాస్తికుడైనను, వివాహానంత రము ఆతఁడును నేనును ఏకమార్గమునఁ బోవు సహాపథికులము. ఆకారణమున ఆతనికొఱకు నరకము నకు బోవుటకు సంసిద్ధురాలనై యున్నాను.

గోవిం—మంచిది. పొమ్ము. నీ యిచ్ఛవచ్చిన చోటికిఁబొమ్ము. నీవింక నా కుమార్తెవు కావు. నేను నిన్నుఁ బరిత్యజిం చితిని.

అజయ—తండ్రీ! తండ్రీ! యిదియేమి! మీపుత్రిక——

గోవిం-అజయా! ఇంకను నాకీమె పుత్రికయా? పొమ్ముకల్యాణి నీ యిచ్ఛవచ్చినచోటికిఁ బొమ్ము.

కల్యా-మహానందము తండ్రీ! మీ యనుజ్ఞ శిరసావహించు చుంటిని. నాకు సెలవొసంగుఁడు.

అజయ—తండ్రీ! యించుకయోచింపుఁడు. ఈమె యపరాధినియే

మనవావ నీ గభీర సంసారసాగరముస విడుతము.
తండ్రీ! సెలవిందు నమస్కారము.

(కల్యాణీశో నిష్క్రమించును.)

గోవిం-(దిగ్భ్రమం జెంది జూచుచుండును.)

[తెర జాఱును.]



## దృశ్యము 5.

స్థానము—చిత్తూరు పరిసరారణ్యము,

[సగరసింహుండు ఆతని మనుమండగు అరుణసింహుండును ఒక వృక్షము క్రింద నిలచియుందురు.]



సగర—అరుణా! ఈరాజపుత్రస్థానమందు నివసించియుండుటకు నాకుం లేశమాత్రము నిష్టము లేదు. ఈ చిత్తూర్ దుర్గమొకవిధముగ నాకు గారాగృహమువలె నున్నది. పర్వతారణ్య సంకీర్ణమైన యీ ప్రదేశము నాకు భయము గొల్పుచున్నది! నేను తిరిగి ఆగ్రానగరమునకుం బోయెదను.

అరుణ-తాతా! నాకుమాత్ర మీపరిదేశమత్యంత మనోహరమై తోచుచున్నది! ఇచ్చటి ప్రతిపర్వతమును ప్రతివృక్షమును మన పూర్వపురుషుల ప్రతాపచరిత్రములను జ్ఞప్తికి తెచ్చుచున్నవి. మన ప్రాచీనకాలపుమహావీరుల గౌరవకథలు మీకురుచింపవా?

సగర-అదిగో తిరిగి యా ప్రాచీన కాలపు గోలయే?

అరుణ—కాని, తాతా! నాకు వర్తమాన కాలమున కంటె ప్రాచీనకాలమే గౌరవనీయమై తోచుచున్నది.

ఉ॥ అప్పటి యాత్మగౌరవము నప్పటి వీరపరాక్రమక్రమం
బప్పటి క్షాత్రధర్మమును నప్పటి స్వేచ్ఛయులోఁదలంచినన్
ఇప్పటి ద్రోహచింతనము నిప్పటి శూన్యవిలాస జీవనం
బిప్పటి నీచవర్తనము నేగతిఁదోచునొ లోఁ దలంపుమా!

సగర-అదిగో! నేను భయపడినట్లే యైనది! నీవుపెద్దయగుచున్న కొలఁదియు నీతల్లివలెనే విజృంభించుచున్నావు! ఆమెయు నిట్టి మాటలనే యనుచుండెను! తుదకు నిర్వాసితయై యెచ్చటనున్నదో యెరికినిఁ దెలియరాకుండఁ బోయినది.

అరుణ-తాతా! నాతల్లిసహితమిట్టి మాటలనే చెప్పుచుండెనా?

సగర—ఇట్టి యర్థములేని మాటలనే చెప్పుచుండెను."మేవార్ మేవార్" అని యఱచుచుఁ బిచ్చియెత్తి గృహము విడచి పోయినది.

అరుణ—అట్లైన తాతా! నేనామెను వెదకి తెచ్చెదను.

సగర-వెదకి తెచ్చెదవా? ఎచ్చటనున్నదని వెదకెదవు? ఈమహార ణ్యమునందు సూర్యుండు దాగినను కనుంగొనుట కష్ట సాధ్యము! అట్టిచో ఆమెను నీవు వెదకి తెచ్చెదవా?

అరుణ-తప్పక వెదకి తెచ్చెదను. నేనిప్పుడు "ఆగ్రా" కురాందలంచుకొనలేను. మీ కిష్టమున్న మీరు పోవచ్చును. ఆగ్రాకన్న ఈ ప్రదేశమే నాకుహృదయానందకరముగ నున్నది.

ఆ॥ వె॥ వసుధ యందు నాకుఁ బ్రత్యక్ష దైవంబు
నన్నుఁ గన్నతల్లి యున్న దిచట
కలదె యింతకంటె ఘనతరంబగు ప్రదే
శంబు నాకు ముజ్జగంబు లందు?

సగర-(స్వగతము) నేనాది నుండియు భయపడుచునేయుంటి ని—(ప్రకాశముగ) నాయనా! ఆగ్రాయందలి పాదుషావారి శిలానిర్మితమైన మహల్ నీవు చూడలేదుకదా రమ్ము ఈ సారి నీకా భవనముఁ జూపెదను.

అరుణ-వలదు. మహల్ గిహల్ చూచుట నాకిచ్చలేదు. ఈ నిర్జన వనమే నాకంతకంటె వేయిరెట్లు రమణీయముగ దోచును.

సగర-అట్లుకాదు నాయనా! ఆగ్రాయందు నీవు చూడదగిన విశేషము లింకను ననేకములున్నవి. ఒకదానికొకటితీసి పోవని మసీదులు డెబ్బది యెనిమిది యున్నవి ఇంకను-

అరుణ-తాతా! ఎందులకీ వృథాప్రసంగములు?

తే॥ గీ॥ అపటి బహురత్న తేజో వ । యంబులైవ
లలిత రాణ్మందిరంబులు । లతుకంటె
పూజ్యమైన యీరసపుత్రి । భూమిలోన
శిథిల మందిర మొకటియే । శ్రేష్ఠతరము!

(తటాలున సత్యవతి ప్రవేశము)

సత్య—దీర్ఘాయుష్మంతుఁడవు కమ్ము కుమారా!
(అరుణసింహునిఁ కౌగలించుకొనును.)

సగర—(విస్మితుఁడై) ఎవరది సత్యవతీ! సత్యవతీ! నీవిచ్చటికెట్లు వచ్చితివి?

సత్య-(కుమారు నుద్దేశించి) నాయనా! నాఁడు స్వదేశ హితార్థమై నేను సన్యాసినినై గృహపరిత్యాగ మొనర్చిన సమయమున నీ చిన్ని చేతులతో నీవు నన్ను భధింప యత్నించితివి. ఆభంధనంబునుండి విముక్తనై వెడలిపో వునపుడు నేనెట్టి హృదయ వేదన ననుభవించితినో నీవెఱుఁగవు తండ్రీ! దుష్కరమగు నీసన్యాసినీ వృత్తిని ఇంతకాలమును మేవాడ యశోగీతములను బాడుకొనుచు బర్వతారణ్యములఁ బట్టి సంచరించుచుంటిని కాని, నీమధుర మందహాసమును మాత్రము నేనుమఱువ జాలకుంటిని. ఆగ్రానగరమును విడచి నీవిచ్చటికి వచ్చి యుండిన సమాచారమును విని ప్రేమోత్సాహమును భరింపఁజాలక నిన్నుజూచుటకై యిచ్చటికి ఱెక్కలు కట్టుకొని వచ్చితిని. ఇంతవఱకు జాటున నుండి నీయమ్మ

తాలాపములను వినుచు నేను పొందిన యానందమున
కుఁ బారము లేదు. దీర్ఘాయుష్మంతుఁడవు కమ్ము తండ్రీ
దీర్ఘాయుష్మంతుఁడవు కమ్ము! కులదీపకుఁడవు కమ్ము
(కౌఁగలించుకొనును.)

సగర-కుమారీ! సత్యవతీ! నీవు నాపై నొక్కసారి యైనను జూడ
వేమి? నేనేమి యపరాధముఁ జేసితిని?

సత్య—(తీవ్రముగ జూచి) అపరాధమా? తండ్రీ! నీకు నీయప
రాధమే తెలియదా?—ఔను నీయపరాధమును గ్ర
హించుకొనునంతటి సామర్థ్యము నీకు లేకపోయినది!

సీ॥ తనయుండవై మహో । దారయౌ తల్లి కు
క్షిని దుర్భరాగ్ని ర । గిల్చినావు!
పురుషజన్మంబెత్తి । పురుషత్వముడిగి మ్లే
చ్ఛుల పంచ కుక్కవై । మెలఁగినావు!
రాజ పుత్రుండవై । పరిభవ మందియు విని
ర్మల వంశమును రూపు । మాపిరావు!
మనుజుండ వయ్యు న । మానుషంబగు మాతృ
హత్యకు సిద్ధమై । యలరి నావు!

గీ॥ నీ కనులు మూసికొనుపోవ । నిన్ను నీవు!
తెలిసికొను టెట్లు? లోకమున్ । దెలియ టెట్లు?
కలుషిత స్వాంత! నీదుము । ఖంబుఁ జూడ
రౌర వాభీల నారక । ప్రాప్తి కాదె?

పొమ్ము. నీమార్గమున నీవుపొమ్ము. మాదారిని మేము పోయెదము. రమ్ము, నాయనా! రమ్ము. అంధకారబంధురమైన యీ ప్రపంచమున నీవు నా సహాయాత్రకుఁడవుకమ్ము.

(అసుణుని చేయిఁబట్టుకొని పోవయత్నించును)

సగర-(వారించుచు) వలదు సత్యవతీ! వలదు. నన్నువిడచి మీరు పోవలదు. నేను సహితము మీవెంట వచ్చెదను. పొరగ్రమ్మియున్న నా నిష్ఠుర నేత్రములకు నేఁడు దృష్టిభాగ్యము కల్గినది. స్వచ్ఛందజీవన సౌందర్యము నీ ముఖమున నాకు గోచరించుచున్నది. నేను మహాపాపిని. మాతృభూమి వినాశనమునకుఁ దోడ్పడిన ఘాతుకాత్ముఁడను! సత్యవతీ! నా యపరాధమును క్షమింపుము. నేటినుండియు నేనుసహితము నీతోఁబాటు స్వదేశవిముక్తికై దారిద్ర్య వ్రతధారణ మొనర్చితిని! రమ్ము. సత్యవతీ! రమ్ము. నన్నొంటరిగ విడచిపోవలదు

సత్య-(మిక్కిలి యాశ్చర్యముతోఁ దండ్రివైపుఁజూచి) తండ్రీ! తండ్రీ! మీరే యీమాటలను బల్కుచుంటిరా?

సగర:—

తే॥ గీ॥ వలదు వలదు నాకీముష్టి, పదవి యింక
మ్లేచ్ఛ దాసుండఁ గానింక, మీద నేను!
మాతృసేవా సమాయత్త, మానసమున
నేను నీవెంటఁజనుదెంతు, నీ క్షణంబె!

సత్య—(మహానందముతో) ఆహా! నేఁడు నాకెట్టి శుభదినము! ఎట్టి శుభదినము!

చ॥ అరులకు సేవకుండయి ని ♦ రర్థక జీవనుఁడైన తండ్రి క్ర
మ్మర జగదీశ్వరేచ్ఛ బుజు ♦ మార్గముఁ దొక్కెఁ గులాభిచంద్రుఁడా
సురగుణరాశి, సన్ జిరవి ♦ యోగ మహావ్యథముంచినట్టి నా
యరుణుఁడు నాకు దక్కె! నహా ♦ హా! నను మించెడు ధన్యలుందురే

(తెర జాఱును)

ద్వితీయాంకము.





ఓం
శ్రీరామచంద్ర పరబ్రహ్మణేనమః.

# మేవార్ పతనము.

తృతీయాంకము.

## దృశ్యము 1.

స్థానము:—ఒక యరణ్యమార్గము—సమీపమున నొక శిథిలగృహము.

[ప్రవేశము-కల్యాణి-అజయసింహుఁడు]

కల్యా—(అలసటతో నిట్టూర్పువిడచి) సోదరా! ఇంక నేను నడువఁజాలను. నాకు గమనాయాస మధికమగుచున్నది.

అజయ-కల్యాణీ! ఇంక నెంతయో దూరములేదు. ఏదో యొక పట్టణపు సమీపమునకే వచ్చితిమి—ఇదిగో, ఇచ్చట నేదియో కుటీరమొకటి కానవచ్చుచున్నది.

కల్యా-ఆ కుటీరము నందెవ్వరైనఁ గలరేమో పిలచి చూడుము.

అజయా-(కుటీరము చెంతకుఁబోయి పరికించి) ఎవ్వరునున్నట్లు తోఁచదు. తలుపులు లేవు. అంతయు నంధకారమయమై యున్నది...(బిగ్గఱగ) ఎవ్వరచ్చట?—ప్రత్యుత్తరములేదు.. కల్యాణీ! ఇందెవ్వరును లేరు.

కల్యా-అట్లయిన, ఈ రాత్రి మన మిచ్చట విడియుదము. ఇంక నొక్క యడుగేని నేను నడువజాలను.

అజయ-అట్లనే కానిమ్ము. నీవిచ్చట విశ్రమింపుము. నేను పట్టణములోనికిఁబోయి దీపమొకటి తెచ్చెదను.

కల్యా-మంచిది. పోయిరమ్ము. నా కాకలిసహితము వేయుచున్నది.

అజయ-ఏదైన నాహారముఁగొని వచ్చెదను. నీ విచ్చటనే యుండుము.

కల్యా-అజయా! త్వరలో రావలయును సుమా! నేనొంటరిగా నుందును. నాకు భయమగును.

అజయ-సోదరీ! నేను త్వరలోనే వచ్చెదను. ఈ ప్రదేశమునందు నీకెట్టిభయమును లేదు. (నిష్క్రమించును)

కల్యా-(విశ్రమించి, పాదములను చూచుకొనుచు) ఆహా!

గీ॥ ఇంత వఱకొక్కనాఁడేని ♦ గృహము విడచి
నడువ లేదూరి బయట నా ♦ ల్గడుగులేని!
కాన, నేటి శిలామార్గ ♦ యానమునను
పదము లొకయింత యిపుడెట్లు ♦ బారి యుండె!

కాని, నా కిదియే మహానంద ప్రదమైయున్నది! నా యిచ్ఛానుసారము నేనీ దుఃఖమునకు దారిద్ర్యమును వరించితిని! నా పదములను నొప్పించుచుండిన ప్రతి శిలాఘాతమును ప్రతి కంటకమును, నా హృదయమునకు మహోత్సాహ

పరిదమై తోఁచినది. నదీప్రవాహము తనకు మార్గావరోధముఁ
గలిగించు పాషాణములను వృక్షములను లక్ష్యముసేయక,
ఎట్లు తన భర్తయగు సముద్రునిఁ జేరఁబోవునో, యట్లే కష్ట
నిష్ఠురములను సరకుఁగొనక, నేను నాస్వామియొద్దకుఁ బోవు
చున్నాను. కాని, ఆతఁడు,

మ॥ ముదమూరన్ ననుఁగాంచి నా హృదయ సం ♦ భూతాగ్నిఁ జల్లార్చి, త
త్పద సాన్నిధ్యమునందుఁ దావొసఁగి నన్ ♦ బాలించునో!—లేక నా
హృదయంబున్ గననోడి నన్నుఁగని, "యో ♦ సీ!" పాతకీ! నీవు నా
యెదుటన్ నిల్వకు, పొమ్ము, పొమ్మనుచు నన్ ♦ హింసించి పోఁ దోలునో!

(విచారముతో యోచించుచుండును. కొంతసేపుండి, ప్రక్కకుఁజూచి) ఎవరువారు? (లేచి నిలువఁబడును.)

(ఫకీరు దుస్తులతో సగరసింహుఁడు ప్రవేశించును)

సగర—అమ్మా! నేనొక రాజపుత్త్రుఁడను. నీ కెట్టి భయమును వలదు. నీవుసహితము రసపుత్త్రస్త్రీవలెనే కనుపట్టుచున్నావు. తల్లీ! నీ వీ యరణ్య ప్రదేశమున నేకాకినివై యుంటివేల?

కల్యా—ఆర్యా! నే నేకాకిని గాను. ఇంతదనుకను నా సహోదరుఁడు నాయొద్ద నుండెను. ఇప్పుడిప్పుడే యాతఁడు

దీపమును ఫలాహారమును గొనివచ్చుటకు చేఱువ నున్న పట్టణములోనికిఁ బోయెను.

సగర-మంచిది. అతఁడు వచ్చువఱకు నేను నీకు సహాయుఁడనై యుండెదను. ఈప్రదేశము దోపిడికాండ్ర యక్రమ సంచారములకు గుఱియైయున్నది. క్షణము క్రిందటనే యట్టి ఘాతుకులను కొందఱిని నేను చూచితిని. నీ సహోదరుడు వచ్చువఱకు నేను నిన్ను రక్షించెదను.

కల్యా—కృతజ్ఞురాలను.

(తెరలో—కలకలధ్వని)

కల్యా-ఆర్యా! ఆ కలకలమేమి?

(ప్రవేశము ముగ్గురు దొంగలు)

కల్యా—ఆర్యా! ఆర్యా! వీరెవరు?

(కొంతతడవు దొంగల వికృతగీతములు, వికృతాలాపములు జరిగిన పిదప)

మొదటిదొంగ-అరే! అరే! భఁయాఁ! హిఙ్గా! హిఙ్గా! హిఙ్గా దేఖోరే! (చంకలు గుద్దుకొనుచు)

రెండవదొంగ-(ఉత్సాహమభినయించుచు) అరే! అరే! హాక్టీ హాడ్డీ! హెక్టీ మొఙ్గూ! ఘూప్రహారీ! ఘూప్రహారీ!

మూడవదొంగ-అరే ఛలో. ఛలో. పహిలే హాడాదాన్కీ-పట్టా

మొదటిదొంగ-నహీ! నహీ! పహిలే మొఙ్గూకీ ఫఙ్గో. ఛలో.

(ముగ్గురును సమీపింతురు)

కల్యా-(భయముతో బిగ్గఱగ). ఆర్యా! ఆర్యా! రక్షింపుఁడు. రక్షింపుడు.

సగర—(కత్తిదూసి, ముందునకువచ్చి) అరే! మూర్ఖులారా! మీరెవరు?

దొంగలు అరే బూఢాగాడ్డీ! మేమూ హెవ్వాౘైతే నీకూ హెందుక్కా? నోరూ ఖట్టీ హిక్గా ఖడేరహో.

సగర-ఓరీ నీచులారా! ఏమంటిరి? ఏమంటిరి? (ఖడ్గముఝుళిపించును)

దొంగలు—క్యారే ముస్లీ పందీ! నీకూ బుద్ధీలేదూ వుందీ.

(ముగ్గురును సగరసింహునిపైఁబడుదురు, సగరసింహుఁడు క్రిందఁబడును)

కల్యా—(భయకంపితయై బిగ్గఱగ) అజయా! అజయా! రక్షింపుము. రక్షింపుము.

(తొందరగా దీపమును ఫలాహారసామగ్రియుఁ గైకొని అజయసింహుఁడు ప్రవేశించును.)

అజయ-వచ్చితిని. వచ్చితిని. కల్యాణీ! భయపడకుము. (సామగ్రి క్రిందఁబెట్టి) ఓరీ ఘాతుకులారా! (కత్తిదూసి దొంగలపై దుముకును. క్రమముగ ముగ్గురుదొంగలును నేలఁగూలుదురు).

అజయ—కల్యాణీ! ఈశ్వరేచ్ఛచే నీ యాపద గడచినది. ఇంక భయపడకుము. (సగరసింహునిఁజూపుచు) ఈతఁడెవరు.

కల్యా—ఈతఁడు సహితము మనవలెనే యొక బాటసారి. రాజ పుత్త్రుఁడు! ఈచోరుల బారినుండి నన్నురక్షింపఁ దల పడిన మహోదారుఁడు. పాపము! ఆప్రియత్నములోనే యీతఁడు క్రిందఁబడెను.

సగర-(మెల్లఁగ లేచి నలువైపులఁ గలయఁజూచి) నాయనా! నీ వెవ్వరవు?

అజయ-ఆర్యా! నేను మేవార్ సైన్యాధిపతియగు గోవింద సింగ్ పుత్త్రుఁడను. నాపేరు అజయసింగ్! ఈమె నా సోదరి కల్యాణి!

సగర—(విస్మితుఁడై) కల్యాణియా? గోవిందసింగ్ పుత్త్రిక కల్యాణియా?—మహబత్ఖాన్ భార్యయా?

అజయ-చిత్తము.—ఆర్యా! మీరెవ్వరు?

సగర-నాయనా! నేను మహబత్ఖాన్ తండ్రిని! సగరసింహుఁ డను.

(అందఱును ఆశ్చర్యము నభినయింతురు).

(తెరజాఱును.)



## దృశ్యము 2.

స్థానము—ఆగ్రాయందు మహాబత్ఖాన్ గృహము.

[ప్రవేశము—మహాబత్ఖాన్ విషాదముతో నిటునటుఁ దిరుగుచుండును.]

మహా—(స్వగ) మా యిర్వురకును వైవాహిక బంధనము తెగి, యింతకాలము గడచిపోయినను, ఇంకనేల సారె సారె కును ఆమె నాధ్యానమునకు వచ్చుచున్నది! ప్రేమోజ్వలమైన యామె కిశోర ముఖబింబము నాకండ్లకుఁ గట్టుచున్నది! ఆహా! నిశ్చయముగ నేనొక యనర్ఘరత్నమును పోఁగొట్టుకొంటిని. నా జీవనము నంధకారమయముఁ గావించుకొంటిని.........ప్రేమామృత మొలుకుచుండిన యామె లేఖను నేనేల తిరస్కరించితిని? అట్టి నిష్కళంకహృదయమును నేనేల బాధించితిని? ఆమె జనకుని యెడల నాకుఁగల క్రోధావేశమే నా చేత నిట్టి యకార్యమును గావించినది. ఆహా! కల్యాణీ! కల్యాణీ.

ఉ॥ అన్నిఁట నన్నుఁ జుట్టిన దు । రంత దురాగ్రహ ధూమరాశిచేఁ
గన్నులు గాన కెంతటి య । కార్య మొనర్చితి నేను నీయెడన్!
ఎన్నటికేనిఁ బ్రస్మర క్షప । హీస్థలి నిన్ గను భాగ్యమబ్బినన్
అన్నుల మిన్న! నీ మృదు ప । దాబ్జము లంటి క్షమింప వేడనే!

(ప్రవేశము—సేవకుఁడు)

సేవ—(అభివాదముఁజేసి) ప్రభూ గజసింహ మహారాజుగారు తమ దర్శనార్థము వచ్చియున్నారు.

మహా-గజసింహమహారాజా? జోధ్పూర్ రాజగు గజసింహుఁడా

సేవ—చిత్తము.

మహా-పోయి యాతనిఁ దోడ్కొ-నిరమ్ము. (సేవకుఁడు నిష్క్రమించును)

మహా-(స్వగ) గజసింహునకు నాయొద్ద నేమిపనియున్నది? ధైర్యసార మెఱుఁగని పిఱికిపంద! క్షుద్రజీవనుఁడు. ఎట్టినైచ్యమున కేని వెనుదీయని మూర్ఖాతి మూర్ఖుఁడు. వీనికి నాతో నేమిపనియున్నది?-అదిగో వచ్చుచున్నాడు.

(ప్రవేశము—గజసింహుఁడు.)

మహా-దయచేయుఁడు, మహారాజా ఏదో యత్యవసర కార్యముపై తామిచ్చటకు వచ్చియుందురని తలఁచెదను.

గజ—మహాబత్ జీ. పాదుషావారు మీకొక విషయమును జ్ఞప్తికిఁదెమ్మని చెప్పిరి.

మహా—ఏ విషయము?—ఓహో, మేవాడపై దండయాత్రను గూర్చియై యుండును.

గజ—చిత్తము.

మహా-ఈ విషయమై పాదుషావారితో నేననేక పర్యాయములు ముచ్చటించియే యుంటిని. కాని, యిన్నిసార్లు

వారేల నాకిట్టి గౌరవము నొసంగుచున్నారో తెలియకున్నది.

గజ—మొగల్ సైన్యము లీవఱకు రెండుసారులు మేవాడపై దండయాత్ర సాగించుటయు, రెండుసార్లును రాజపుత్త్రులచేఁ బరాజయమంది మఱలి వచ్చుటయు, మీకుఁదెలిసిన విషయమే. పాదుషావారి కేమియుఁ దోచక, ఇప్పుడు మీ సహాయము నపేక్షించుచున్నారు. వారి నీ యగౌరవమునుండి కాపాడఁగల సమర్థులు మీరుతప్ప వేఱెవ్వరు కలరు?

మహా-మహారాజా, మీరుసెలవిచ్చునది నాకుఁ జిత్రముగఁ దోచుచున్నది.

గజ—మహాబత్ జీ. నేను సత్యముఁ బల్కుచుంటిని.

మహా-(యోచనాపూర్వకముగఁ దలపంకించును)

గజ—ఈసారి మేవార్ యుద్ధమునకు మీ రస్త్రధారణ మొనర్పవలయును.

మహా—(తలపంకించుచు) మేవాడ నాజన్మభూమి కాకయుండినచో

గజ—ఖాన్ సాహెబ్ మేవాడ మీ జన్మభూమియని నాకుఁ దెలియును. మీరుసహితము రాజపుత్త్రులని యెఱుఁగుదును. రాణా అమరసింహుఁడు మీకు సోదరుఁడని సహితము నాకుఁదెలియును కాని, మీరు మేవాడ సంపర్కమే పూర్తిగఁ బరిత్యజించి ముసల్మానులైరి. ఇంకను మేవాడపై మీకభిమానమేల? ఇంతకును,

మహాబత్ జీ! మీరొక్కసారి — యుద్ధమునకుఁగాదు— విలాసార్థముగనైనను, మేవాడకుఁబోయి చూడుఁడు. మీయందు రాజపుత్త్రులకుఁగల యభిమానము మీకు గోచరించఁగలను "వంశద్రోహి! దేశద్రోహి". యను నిందావర్షము మీపై ధారాపాతముగ వర్షించదా? రాజపుత్త్రులు సోదరభావముతో సన్మానింతురని యెన్నఁడును తలంపకుఁడు

మహా—(తలవంచి యోచించుచుండును)

గజ-మన సంబంధమంతయు నిప్పుడు మొగలాయీలతోనున్నది

ఆ॥ వె॥ మొగలు సేవకులము; మొగలాయి సామ్రాజ్య
గౌరవంబె మనకు గౌరవంబు!
మొగలు చక్రవర్తి పొందెడు సట్టి య
గౌరవంబె మనక గౌరవంబు!

ఖాన్‌సాహెబ్! నేను చెప్పినది బాగుగ యోచింపుఁడు

(ప్రవేశము—ఫకీరుదుస్తులతో సగరసింహుఁడు)

సగర-మహాబత్

మహా—(విస్మితుఁడై) ఎవరు?— తండ్రీ ఈ సన్యాసి వేషమేమి?

సగర—నేను సన్యాసినైతిని

మహా-(ఆశ్చర్యముతో) అదియేమి?

సగర-కుమారా! ఇది నిశ్చయముగ నీ వాశ్చర్యపడవలసిన విషయమే?

చ॥ కులమును శీలమున్ విడిచి కుత్సిత వర్తనుఁడై, స్వధర్మమున్
దలఁపక, పొట్టకూటికయి తన్నినఁ దిట్టినఁ గొంగుపట్టి, మ్లే
చ్ఛుల మొగసాల కుక్కయయి సోలుచునుండిన బానిసీఁడొకం
డిలను స్వతంత్రుఁడై మెలఁగె నిన్ని దినంబుల కీశ్వరేచ్ఛచేన్!

ఇది నిశ్చయముగ నీ వాశ్చర్యపడవలసిన విషయమే కదా—కాని, యీ వేషమెందులకో నీకుఁ దెలియునా?

మహ-ఎందులకు?

సగర-చెప్పెదను వినుము. ఇంతకాలము గడచినపిమ్మట నా మాతృభూమియొక్క ప్రేమ సంకీర్ణమగు నాహ్వానము నాకర్ణపుటముల సోకినది! ఆహా! ఆ యాహ్వానమెంత గంభీరము! ఆ కంఠస్వరమెంత మధురము! వాహుబత్! నీ వాకోమల గంభీర నినాదము నూహింపఁజాలవు! ఈ వేషముతో నిప్పుడు నేను నా పాపకృత్యములకుఁ బ్రాయశ్చిత్త మొనర్చుకొనెదను. కుమారా! నీవు సహితము నీ పాతకములకుఁ బ్రాయశ్చిత్తముఁ గావించు కొనుము.

మహ- నా పాతకములకా?

సగర-ఔను. అసంఖ్యాకములగు నీ పాపకృత్యములకు నీవు ప్రాయశ్చిత్తము గావించుకొనుము. నేను స్వజాతీయులను విడిచి మ్లేచ్ఛులకు దాసుఁడనై ఘోరపాపమునకు బాల్పడితిని. కాని నా పాపముకన్న నీ పాపమే యధికము. ఎట్లందువా?

తే॥ గీ॥ ధర్మ దూరుఁడవయి మ్లేచ్ఛ ♦ దాసుఁడవయి
దేశ విద్రోహి వగుటతోఁ ♦ దృప్తిఁ గనక,
విశ్వపావనమైన నీ ♦ విమల మతము
వదలి, మ్లేచ్ఛుఁడవైయున్న ♦ పాపి వీవు!

మహ—నేను చేసినది పాపకృత్య మెట్లైనదో నాకుఁ దెలియకున్నది! ఇస్లామ్ మతమునందు నాకు విశ్వాసము కుదిరినది. నేనా మతమును స్వీకరించితిని.

సగర-అట్లైన, నీకు హిందూ మతమునందవిశ్వాస ముండెనా? హిందూమతముకంటె ఇస్లామ్ విశ్వాసయోగ్యమని నీ వెట్లు నిశ్చయించు కొంటివి? ఏధర్మముయొక్క మూల మంత్ర మాత్మశక్తియై యున్నదో, యే ధర్మముయొక్క ముఖ్యసూత్రము సర్వభూత సమత్వమైయున్నదో, యట్టి సనాతన హిందూధర్మమును నీవు తిరస్కరించితివి! వంశద్రోహివైతివి! ధర్మద్రోహివైతివి! మాతృద్రోహివైతివి! మహబత్ఖాన్! నీపాపము నీకెట్లు తెలియును?

మహ-తండ్రి! నేఁడు మీరు——

సగర-ఔను. నేఁడు నేను ధర్మోపన్యాసముఁ గావించుచుంటిని అందులకే నేనీ సన్యాసమును స్వీకరించితిని! మహబత్ ఒక్కవిషయము మాత్రము నీవు గ్రహించుము.

ఆ॥ వె॥ ఎట్టి నీచహృదయ ♦ మేని యొక్కొక వేళ
నుచ్చమునకు స్థాన ♦ మొసఁగు చుండు!

అట్టివేళ నాత్మ ♦ స్వార్థ విదూరమై
పరుగు లిడును స్వర్గ ♦ పథములందు!

ఈవిషయము కల్యాణి నాకుపదేశించియుండెను!

మహా-(విస్మితుఁడై) కల్యాణియా?

సగర-ఔను. నీ ధర్మపత్ని కల్యాణి! ఆమె యొకానొక సమయమున నాకీమాటలు చెప్పియుండెను. ఆ యమృత వాక్యము లిప్పటికిని నాకర్ణపుటముల మాఱుమ్రోగుచునే యున్నవి! మహాబత్ఖాన్! మఱచితిని. నీకీవృత్తాంతము తెలియునా?

మహా—ఏ వృత్తాంతము?

సగర—కల్యాణిని ఆమెతండ్రి గోవిందసింహుఁ డిల్లు వెడలఁ గొట్టెను.

మహా-(విస్మయముతో) ఇల్లు వెడలఁగొట్టెనా? ఏల ఏ యపరాధమునకు.

సగర-అపరాధమా? ఆమె తన గృహమునందు విధర్మియైన నీ రూప పటమునకు నిత్యపూజ చేయుచున్నదఁట!

మహా—(కలత పడుచు) భర్తనగు నా రూప పటమును బూజించుటయే యామె యపరాధమా?—ఆమెను మీరెచ్చటఁ జూచితిరి?

సగర-ఒక పట్టణప్రాంతమందలి యొక శిథిలగృహసమీపమున నొకనాటి సంధ్యాసమయమున నేనామెను కడు దీనావస్థయందుఁ జూచితిని.

మహా-(ఉత్తేజితుఁడై) తండ్రీ! ఇదియా మీ యుదార హిందూ ధర్మము? ఇదియా మీ సర్వభూత సమత్వము? పతి భక్తియే కారణముగ, నిశ్చల సతీత్వమే హేతువుగ, కల్యాణి గృహమునుండి వెడలింపఁబడెనుగదా? ఎట్టి విద్వేషము! ఎట్టి విద్వేషము! ఇట్టి పాషాణ హృదయులకు, ఇట్టి ధర్మజ్ఞాన శూన్యులకు, ఇట్టి నరపశువులకు ఆశ్రయభూతమైన యధమాధమ మతము నేమనవలయును? ఇది విశ్వపావనమైన విమల మతమఁట! దీని మూలమంత్ర మాత్మశక్తియఁట! ముఖ్యసూత్రము సర్వ భూత సమత్వమఁట! ఇది సనాతన ధర్మమఁట! దీనిని బరిత్యజించినందులకు నేనొక పాతకుఁడనైతినఁట! ఇట్టి పాపసంకులమగు రాక్షస మతమునకుఁ బ్రపంచమునఁ దావు కలదా?—తండ్రీ! నా పాపములకుఁ బ్రాయశ్చిత్తముఁ జేసికొనుమని మీరు నన్ను హెచ్చరించు చుండిరి. అవశ్యము నేను ప్రాయశ్చిత్తముఁ జేసికొనెదను. ఆప్రాయశ్చిత్తము నేను ముసల్మానుఁడనైనందులకుఁ గాను!—

శా॥ న్యాయాన్యాయ విచార పూజ్యగుణ శూ ♦ న్యంబై, యధర్మక్రియా
భూయిష్ఠంబగు మీకులంబునను నే ♦ పుట్టొంది యుంటిన్ గదా!
ఆ యాదృచ్ఛిక ఘోరపాతకముఁ బా ♦ యన్ నేను నిక్కంబుగన్
బ్రాయశ్చిత్తముఁ జేసికొందును పున ♦ ర్జన్మంబు లేకుండగన్!

గజ—(నిర్విణ్ణుఁడై చూచును)

సిహ-మహారాజా! అట్లు చూచెద రేల? మేవార్ యుద్ధమునకు బోవుటకు నేనేల నంగీకరించితినో మీకుం దెలియునా?

గజ—తెలియ కేమి? మీరు పాదుషావారి క్షేమముఁగోరు ప్రధాన మిత్రులుకావున—

మహా—అట్లుకాదు. హిందూధర్మమును కూకటివేళ్లతోఁ బెకలించుటకుఁ బోయెదను! హిందూమతమును భూగర్భమునఁ బూడ్చివైచుటకుఁ బోయెదను? తెలిసినదా? మీరు పాదుషావారియొద్దకుఁబోయి నాయంగీకారము నెఱిఁగింపుఁడు.

(గజసింహుఁ డొకవైపునకును, మహబతాన్ వేఱొకవైపునకును నిష్క్రమింతురు.)



## దృశ్యము 3.



స్థానము—ఆగ్రాయందు జహంగీర్ పాదుషా దర్బారు—

[పాదుషా జహాంగీర్, సామంతులు, సేనాపతి హిదాయతాలీ ఖాన్, ఉచితాసనములఁ గూర్చుండి యుందురు]



జహా—సామంతులారా! ఈ పరాజయమును ఈజన్మమునందు నేను మఱువఁజాలను! అసంఖ్యాకమగు మన మొగ

లాయిసైన్యము, నామమాత్రకమైన రాజపుత్రసైన్యముచేఁ బరాభూత మయ్యెననిన, నాదేహము కంప మొందుచున్నది!-దేవార్ యుద్ధ పర్యవసాన మట్లైనది ఇంక నీ యుద్ధమునందుఁ సహితము మాపతాకమును కట్టి గతియే పట్టినది!....తుదకో యువరాజు పర్వేజున కేమైనది? ఆతఁడేల పరాజయమందెను? (తీక్ష్ణముగ హిదాయత్ వైపుజూచి) హిదాయత్! యుద్ధభూమిపై నీవు బందీకృతుఁడవై రాజపుత్రుల దయాధర్మమున విముక్తుడవైతివి! అబ్దుల్లా రణరంగమునఁ బ్రాణములు ధారపోసి వీరస్వర్గము నందెను. కాని, నీకు మాత్రి మచ్చట చచ్చుటకు మనసొప్పినదికాదు! భీరూ! నీ యట్టి పందలు సేనాపతులైయుండ, మాకు పరాజయము కాక విజయము లభించునా?

( ప్రవేశము——సగరసింహుఁడు )

జహాం-ఓహో! రాజా సగరసింగ్! దయచేయుఁడు.

సగర-సార్వభౌమా! నాదొక్క విన్నపము కలదు.

జహాం—సావధానుఁడను. చెప్పుడు——మీకు మేవాడ రాణా పదవినిచ్చి చిత్తూర్ పంపియుంటిమికదా! కాని, చిత్తూర్ దుర్గమును మీరు రాణా అమరసింగ్ అధీనము గావించితిరని వినియుంటిని, సత్యమేనా?

సగర—సత్యమే.

జహాం-ఎవరి యనుజ్ఞపై మీరట్లు గావించితిరి?

సగర-అంకుల కొకరి యనుజ్ఞ యవసరమని నేనూహింపలేదు. రాణా అమరసింహుండే న్యాయముగ చిత్తూరునకధిపతి యని నేను గ్రహించితిని.

జహాం-ఎట్లు?

సగర—ఎట్లా? మీతండ్రి యక్బర్ పాదుషావారు ధర్మయుద్ధ మొనర్చి చిత్తూరును స్వాధీన పఱచుకొని యుండలేదు. కపటోపాయములచే వారు చిత్తూరు నాక్రమించిరి. న్యాయ విచార మొనర్చిన చిత్తూరునకు మీరెట్లధిపతు లయ్యెదరు?

జహాం—రాజా! మీరిట్టి న్యాయవిచారమును ప్రారంభించి యెన్నిదినములైనది?

సగర-ప్రభూ! ఇంతకాలమును నన్ను దృష్టిమాంద్యునిం జేసిన యొక తెర తొలంగింపంబడినది! మా వంశమున కాదిపురుషుండగు భగవాన్ రామచంద్రుని కాలమునుండి, నేటి వఱకును నా స్వదేశ చారిత్రము నాకన్నులకుంగట్టినది

సీ॥ కనుగొంటిం గన్నుల । కఱవు తీరంగ బాప్ప
రావల్ మహా పరా । క్రమ విధంబు!
కంటింజూచితి నాదు । కలుషంబులు నశింప
సంగ్రామ సింహు సు । క్షాత్ర దీప్తి
అరయం గాంచితిని నే । త్రానందముగ రాణి
పద్మావతీ శౌర్య । వైభవంబు!
దర్శించితిని జన్మ । తారకంబుగ శ్రీ ప్ర
తాప సింహుని ఖడ్గ । ధారణంబు!

గీ॥ అహాహా! యట్టి మహావీరు ♦ లవతరించి
నట్టి లోకైక పూజ్య వం ♦ శార్ణవమున
కాలకూట విషజ్వాల ♦ లీలఁబుట్టి
కులము రూపుమాపుచు నున్న ♦ కూళ నేను!

ఆ మహాపురుషుల కీర్తి తేజమునకుఁ గళంక మాపాదించిన వంశద్రోహిని నేను! నా యపరాధమును నే నిప్పుడు గ్రహించితిని. నా మనోవేదన దుర్భరమైనది! మీ కృపా కటాక్షమున నాకు లభించిన చిత్తూర్ దుర్గము నాకు ఉచ్ఛిష్టాన్న ప్రాయమై హేయమైనది! ఆ దుర్గముపై నాకు గాని, మీకు గాని, యెట్టి యధికారమును లేదని గుర్తించితిని! ఇంకను నేనా దుర్గమునం దెట్లు నిలువఁగలను? ఈ సత్యమును నేను గ్రహించిన యుత్తరక్షణమే నాసోదరుని కుమారుఁడును చిత్తూరునకు న్యాయముగ నధిపతియు నగు రాణా అమరసింహున కాధిపత్య మొసంగితిని.

జహాం–రాజా! మీరు మరణమునకు సిద్ధపడియే వచ్చియుంటిరా (తీక్ష్ణముగఁ జూచును)

సగర—సార్వభౌమా! ఏనాఁడు నేను మ్లేచ్ఛ సంపర్కమును విడచి, మ్లేచ్ఛప్రసాదితమైన చిత్తూర్ దుర్గమును పరిత్యజించితినో, యానాఁడే మృత్యుభయము నశించినది నాటినుండియు నేనొక క్రొత్త పాఠమును నేర్చుకొంటిని

జహాం—ఏమి? (తీక్ష్ణముగఁ జూచును).

సగర—ఈ ప్రపంచమున రెండు రాజ్యములు కలవు. మొదటిది స్వార్థము. రెండవది స్వార్థత్యాగము! మొదటిదాని పరిమితి నరకము. రెండవదాని పరిమితి స్వర్గము; ఇంత పఱకును స్వార్థ రాజ్యమునందే నివసించి యుంటిని. కాని నేఁడునేను స్వార్థత్యాగ మహారాజ్యమున బ్రవేశించితిని! సార్వభౌమా! ఈ మహారాజ్య మెట్టిదో మీకుఁ దెలియునా? శాంతి, ప్రేమ, భక్తి, మున్నగు సాత్త్విక గుణరత్నములకు నిధి! తుచ్ఛములగు ప్రాణములను దృణీకరించి కర్తవ్యమును బాలించుటయే యచ్చటి ప్రజల విధి! నా భాగ్యవశమున నేటికి నేనా ప్రజానివహము సందోక్కరుఁడనైతిని! సార్వభౌమా! నాకిప్పుడు మృత్యుభీతి లేశమాత్రమేని లేదు.

జహాం—(గంభీరముగ) మంచిది. అట్లైన మీకు నేను మరణ శిక్ష విధించితిని. సిద్ధపడుఁడు.

(చోబ్దారునకు సంజ్ఞచేయును. చోబ్దార్ ముందునకువచ్చును)

సగర—రాజేంద్రా! సర్వసిద్ధముగ నున్నాను. అవశ్యము నాకా శిక్ష తగియే యున్నది!—

సీ॥ సలలిత శ్రోత్రమన్ ॥ తులసీ వనమునందు
వెలసిన గంజాయి ॥ మొలక నేను!
పడి పంచఁజేరి మీ ॥ రిడిన యుచ్ఛిష్టంపుఁ
గూడు మెక్కిన యట్టి ॥ కుక్క నేను!

కని పెంచి నట్టి నా । జననికి ఘోర వి
    ద్రోహ మొనర్చిన దురా । త్ముఁడను నేను!
జ్ఞాతి విధ్వంసంబుఁ । గంటఁజూచుచు చలిం
    పక యున్న పెను శిలా । ప్రతిమ నేను!
గీ॥ అట్టి నాయట్టి పరమ పా । పాత్ముఁడునకు,
మాతృ హంతకునకు, బంధు । ఘాతకునకు,
చెంటి మ్లేచ్ఛులు పెంచిన । శునకమునకు
ధరణి మరణమే, మరణమే । శరణ మింక!

ఈ కృత్యమునకు హంతకులేల? (మొలనున్న బాకుఁ దీసి పొడుచుకొని నేల వ్రాలును.) ఈ నా హృదయరక్తము నా పాపములకు...... ప్రాయశ్చిత్తమగుఁగాక!

(మరణించును. తెరజాఱును)

తృతీయాంకము.



ఓం

శ్రీరామచంద్ర పరబ్రహ్మణేనమః

# మేవార్ పతనము.



## చతుర్థాంకము.

### దృశ్యము 1.

స్థానము:—ఉదయసాగర తీరము—

[రాణా అమరసింహుఁడు మంటపముపైఁ గూర్చుండియుండును]



అమర—(స్వగ) ఆహా! సంసారమెట్టి యగాధ సముద్రము! ఎట్టి విచిత్ర తరంగ కల్లోలితము! దుఃఖభూయిష్ఠమైన యీ ప్రపంచమునందు మానవు లెంత నిర్విచారముగ జీవించు చున్నారు! వారిపాదములక్రింద భూకంప మావిర్భవించినను వారికిఁ దెలియకున్నది! ఇది యంత యుఁ బరమేశ్వరుని లీలావిశేషమని నాయభిప్రాయము

తే॥ గీ॥ ప్రకృతి వైచిత్ర్యముల నాట ♦ వస్తువులుగఁ
జేసి మఱపించు చుండును ♦ చింత లెల్ల!
కానిచో నీ యసంత శ్మ ♦ శాన మందు
క్షణము జీవింపఁ గోరునే ♦ మనుజుఁ డహాహా!

(ప్రవేశము—మానసి)

మానసి-తండ్రీ! మీరింక నిచ్చటనే కూర్చుండి యుంటిరా? రండు. ఇంటికిఁదోవ్రుదము రండు. ఇచ్చట మంచు విశేషముగఁ గుఱియు చున్నది!

అమర—మానసీ! ఇంచుక తాళుము. ఈ యుదయసాగర తరంగముల మధుర సంగీతము నా కించుక మనశ్శాంతి కలుగఁజేయుచున్నది:—మానసీ:—

మానసి—ఏమి?

అమర—ఈ సంసారము కపటగర్భితమని నీ కెన్నఁడైనఁదోచినదా

మానసి—సంసారము కపట గర్భితమా?

అమర—ఔను. ఇంచుక మనము యోచించుటకుఁ బ్రారంభించితిమేని, యీ కపట సంసారము మన కెన్ని యో యభేద్య సమస్యలనుజూపి, క్రమక్రమముగ మనలను దనయందు లీనము చేసికొనును.

మానసి-లేదు తండ్రీ! ఈ సంసారము నా కంతే కపటభూయిష్ఠముగఁ దోచుటలేదు.

అమర-మానసీ! చంద్రకాంతి సముజ్జ్వలమైన యీ రాత్రి నీ కెట్లున్నది? ఈ సరోవర తరంగముల మృదు మధుర నాదము నాకర్ణింపుము. ఇవి నీ మనోవిచారములను మఱపుఁగొల్పుట లేదా? ఇట్టి యానంద ప్రదములగు ప్రకృతి విలాసములనుండి యీ సంసారము మానవుని దూరస్థునిఁజేసి యైహిక క్లేశములనియెడి విషజ్వాలల

యుంచు ద్రోయు మండును. కుమారీ! నాకీసంసారమనిస ససహ్యమగుచున్నది! నిస్సారమగు దీనినుండి తొలఁగి సుఖించెదఁగాక! ప్రపంచమంతయును కేవలము కపట గర్భితమని నేను గ్రహించితిని! మానవకోటి కపట భూయిష్ఠమని నేను గుర్తించితిని! మానసీ! మనుజులు,

తే॥ గీ॥ స్వార్థచింతా పరాయణుల్ ♦ పాపమతులు,
వికృత చిత్తులు, కుటిల వి ♦ ద్వేష నిధులు,
"ఆత్మ వత్సర్వ భూతాని" ♦ యనెడు చింత
కలికమునకేని కలదె యీ ♦ ఖలుల యందు!

మానసి-తండ్రీ! అది మానవజాతికి నైసర్గికమైన మానసిక వ్యాధి! ఆ వ్యాధియే లేకున్న మానవుల ప్రేమభావమునకు స్థానమే లేదు! అట్టిచో, ఎవ్వరిదుఃఖమును నివారించి, యెవ్వరి నుద్ధరించి, మనుజులు సుఖింపఁగలరు? సంసారము అధమమని యెంచి, దానిని బరిత్యజించుట యుచితముకాదని నాయుద్దేశము! మానవ జీవితము దుఃఖపూరితము! ఆ దుఃఖమును నశింపఁజేయుటకే మనము యత్నింప వలయును.

(తెరలో—"మానసీ! మానసీ!" అని పిలుపు.)

మానసి-(విని) అమ్మా! వచ్చుచున్నాను—తండ్రీ! మీరింక నిచ్చట మసలకుఁడు; చంద్రాస్తమయమై చీకటి నలుగడలఁ గ్రమ్ముచున్నది!

(నిష్క్రమించును.)

అమర—(స్వగతము) ఆహా! ఈ బాలిక వాక్యములెంత మధు
రములై యున్నవి! ఈమెపల్కినది వాస్తవమనియే
తోచుచున్నది!.... ఔను. ప్రపంచమునందు దుఃఖమే
లేకుండిన మానవుల ప్రేమభావమునకు స్థానమే లేదు!
సంసారమునందలి విచిత్రసౌందర్యము నాకిప్పుడు గోచ
రించుచున్నది! ఓహో! మానసీ! నీవు బాలిక వేయైనను

(ప్రవేశము—రాణి రుక్మిణి)

రాణి-ప్రభూ!—

అమర-రుక్మిణీ! కొంచెము తాళుము తాళుము. నేనిప్పు డపూ
ర్వమగు నొక మహాస్వప్నము గాంచుచున్నాను!
కొంచెము తాళుము.

రాణి-మేలుకొని యుండియే స్వప్నము గాంచుచుంటిరా?
అట్లైన నన్ను క్షమింపుడు.

అమర-పోయినది! రసభంగమైనది:-ఇంకనీవు మాటలాడనచ్చు
ను. ఏమి కావలయును?

రాణి-ఏమున్నది? ఈకాలపు బిడ్డలు తలిదండ్రులమాట లక్ష్య
ము సేయరు. ఆనాడు గోవిందసింహుని పుత్త్రియును
బుత్త్రుడును దండ్రిపై గినుకవహించి గృహమువిడచి
పోయిరి. పిమ్మట, నిన్న మానసి—

అమర-(చీకాకుతో) తిరిగి యాఘోషయే? ఆ నిరర్థక విష
యమే?—కానిమ్ము, చెప్పుము.

రాణి-ఈ కలియుగమునందలి బిడ్డలందఱు నిదియే వైఖరి! మేము సహిత మొకప్పుడు యువతులమై యుంటిమి కాని, యిట్టి నిర్లక్ష్య భావమును మే మెఱుఁగము.

అమర—మీరుండినది సత్యయుగ మేమో. తల్లులు సత్యయుగము నందును పిల్లలు కలియుగమునందును మెలఁగుచుందురు కదా? పోనిమ్ము. ఇప్పుడా ప్రసంగ మేల? మానసి విషయమై యేమియో చెప్పుచుంటివి?

రాణి-మానసికి వివాహముఁ గావించుటయే నీ సంకల్ప మైన చో, వెంటనే గావింపుఁడు. క్షణమాలసించితి మేని యామెకు వివాహము జరుగుటయే యసాధ్యము.

అమర-నాకుసహిత మట్లే తోచుచున్నది. మానసికి వివాహము కాదేమో యనికూడా సందేహము కలుగుచున్నది. ఆ మెజన్మము వివాహముకొఱకు కాదని నావిశ్వాసము

రాణి-చాల బాగుగనున్నది. మీరు నిశ్చయముగ మేల్కొని యుండియే స్వప్నముఁ గాంచుచున్నారు.

అమర-ఔను. నేను స్వప్నము నే గాంచుచున్నాను. అపూర్వ మగు స్వప్నము. పర్యవసాన మేమగునో చూడుము.

రాణి:—ఏమగును? వివాహముహూర్తము నిశ్చయించుటకు మనము జోడ్పూర్ మహారాజు గజసింహుని యొద్దకు వర్తమాన మంపియుంటిమి కదా. వార్తాహరుఁడు వచ్చిన పిమ్మట సంతయుఁ దేలఁగలదు.

అమర-వార్తాహరుఁడు జోడ్పూర్ నుండి తిరిగి వచ్చినాఁడు.

రాణి—(ఆతురతతో) వచ్చినాఁడా? వివాహ మెప్పటికి నిశ్చయింపఁబడెను?

అమర—గజసింహమహారాజు మనతోఁడి సంబంధమునకే యిష్టపడలేదఁట!

రాణి—ఏమి?

అమర—ఏమందువా? వారు మొగలాయి చక్రవర్తికిఁ బరమభక్తాగ్రగణ్యులు! దేవార్ యుద్ధమునందు మనము జయించుటయును మొగలాయీలు పరాజితులగుటయు వారికి దుస్సహమైనది! నాటినుండియును మనమనిన వారు మండి పడుచున్నారఁట!

రాణి—(నిట్టూర్పువిడచి) మానసివివాహ మెట్టి యంతరాయములును లేకనే జరుగునని నేననుకొని యుండలేదు.

అమర—ఆవిషయము నాకుసహితము తెలియును. ఆమె జీవితము వివాహమునకై యేర్పడలేదు. మనము కేవలము భ్రమపడి యుంటిమి—ఇప్పుడు జోద్పూర్ మహారాజు ఆగ్రకుఁబోయియున్నాఁడని తెలియుచున్నది!

రాణి—ఎందులకు?

అమర—సార్వభౌముని సందర్శించి, యాతనికిఁ బ్రోత్సాహమొనర్చి మేవాడపై మఱియొక దండయాత్రసాగింపఁజేయుటకు! (నవ్వును)

రాణి—మఱియొక దండయాత్రయా?—ప్రభూ! నవ్వుచుంటిరేల ఈ వృత్తాంత మంత హాస్యభాజనమైయున్నదా?

అమర-మరేమి, రుక్మిణీ! నీవుసహితము నాతోఁగూడి యానందింపుము. ఈ దండయాత్రతో మనకీ వైహికచింత యే గడచిపోవును.

రాణి-ఏమైనను సరియేకాని, మానసి వివాహముమాత్రము జరిగి తీరవలయును.

అమర—ఎట్లు జరుగఁగలదు?

రాణి—(తీవ్రముగ) జోద్పూర్ పై దండయాత్రసాగింపుఁడు.

అమర—(చిరునవ్వునవ్వి) రుక్మిణీ! ఇంతకాలమునకునీవుక్షత్రిణివలె మాటలాడితివి! కాని, శక్తికన్న భక్తియే యీ ప్రపంచమున బలవత్తరమై యున్నదని నీకుఁదెలియదు! గజసింహునియందు మొగలాయిభక్తి మిక్కుటముగ నున్నది! అది మనయందు లేదు. మనయందు కేవలము శక్తిమాత్రమున్నది!

రాణి—అట్లైన, ఈ యవమానమును సహించి యూరకుండవలసినదేనా?

అమర-ఊరకుండక చేయునదేమి?-ఈసారి రసపుత్రజాతి సమూల విధ్వంసమగును. ఇట్టి క్షుద్రమగు జాతికీ శిక్ష తగియే యున్నది! స్వయముగ జగదీశ్వరుఁడు వచ్చినను ఈ యధమాధమ జాతిని రక్షింపఁజాలఁడు!

రాణి-ప్రభూ! ఇందు మీయపరాధమేమి?

అమర—నా యపరాధమా? నేను జోద్పూర్ మహారాజునకు స్వజాతీయుఁడ నగుటయే నాయపరాధము!

ఆ॥ వె॥ అజ్ఞుఁడైన యొక్క ♦ యధము దోషంబునన్
వనధియందు నావ ♦ మునుఁగు వేళ,
దోషిలోఁడ నెట్టి ♦ దోషంబు నెఱుఁగని
జనులు కూడ మునిఁగి ♦ చావ రొక్కొ?

రుక్మిణీ! దీనివిషయమై మనము విచారింపనలసిన పని లేదు. రమ్ము. పోవుదము.

(నిష్క్రమింతురు)



## దృశ్యము 2.



స్థానము:- మేవార్ సమీపమున మొగల్ స్కంధావారము-మహాబత్ఖాన్ డేరా

[ప్రవేశము-మహాబత్ఖాన్, యువరాజు పర్వేజ్, జోధ్పూర్ రాజు గజసింహుఁడు]



మహ-యువరాజా! ఇంక మీరాలస్యముఁ జేయఁదగదు. ఆ లక్షసైన్యమును దోడ్కొని యీ క్షణమే చిత్తూర్ దుర్గమును ముట్టడింపుఁడు.

యువ-మంచిది. (నిష్క్రమించును)

మహ-(గజసింహునితో)మహారాజా! మీరు కొంతసైన్యమును దోడ్కొనిపోయి, యొకవైపునుండి మేవాడ రాజ్యమందలి నివాసగృహములను మంటఁబెట్టుఁడు. తెలిసిన

దా? ఈ కార్యమునందు మీరత్యంత జాగరూకత
తోడను నైపుణ్యముతోడను మెలంగుదురని నాకుఁ
దెలియును. కాని, ఒక్కవిషయము మాత్రము మీరు
జ్ఞప్తియందుంచు కొనుఁడు.

క॥ నీ చర్యకు భీతిలి మిము
యాచింపఁగవచ్చు నచటి యబలలయెడ నే
నీచాత్ముండేనియు న
త్యాచారము సలుపకుండ సరయఁగ వలయున్!

గజ-మంచిది. అట్లనే చేసెదను. కాని, మేవాడయందు పురుషుఁడై జన్మించిన వాని నొక్కనినైన బ్రతుకనీయను. నివాసగృహ మొక్కటైన మేవాడయందు మిగుల నీయను.

మహ-మహారాజా! మీసామర్థ్యము నాకుఁదెలియును. ముసల్మానులకంటె, రాజపుత్త్రులే రాజపుత్త్రులకు భయంకర శత్రువులని నాకుఁదెలియును! హిందువులే హిందువులకుఁ బరమశత్రువులు! రసపుత్త్రులను నాశనము చేయుటయందు మీరు చాల కుశలులని నాకు బాగుగ దెలియును. కావుననే మేవాడను మంటఁబెట్టు కార్యభారమును మీపైనుంచితిని. మహారాజా! ఇంకమీరు మీపైశాచిక కృత్యమును బ్రారంభింపుఁడు.

గజ-చిత్తము.

(ఇరువురును జెరియొకవైపు నిష్క్రమింతురు)



## దృశ్యము 3.



స్థానము:—ఉదయపురము సందలి రాజమందిరము—

[రాణా అమరసింహుఁడు, సత్యవతి కూర్చుండి యుందురు.]



అమర-సత్యవతీ! ఈసారి నీ సహోదరుఁడు మహాబత్ఖాన్ సేనాధ్యక్షుఁడై యుద్ధమునకు వచ్చెనఁట!

సత్య—ఔను. మహాబత్ఖాన్ స్వయముగ యుద్ధమునకు వచ్చినాఁడు. ఆతనివెంట నొకలక్షసైన్యమున్నది—మహారాజా! నేనాతని సహోదరినై పుట్టినందుల కెంత పరితపించు చుంటినో నీ వూహింపఁజాలవు!

అమర—సత్యవతీ! నేను సహిత మాతనిసోదరుఁడనేగద!-దాని కేమి?—నేను మొదటనే చెప్పియుంటిని.

సత్య-ఏమని?

అమర-ఇంక మేవాడకు రక్షణ మసంభవమని నేను మొదటనే చెప్పియుంటిని. ఈ యుద్ధమున మనము మన సర్వస్వమును గోల్పోవుట నిశ్చయము. రాజపుత్రస్థాన మంతయును నిర్జీవమై పరహస్తంగతమైయుండ, ఒక్క-మేవాడరాజ్యము-నిస్సహాయమైయున్న మేవాడరాజ్యము, ఇంక నెంతకాలము తనస్వాతంత్ర్యమును కాపాడుకొనఁగలదు?-ఇంక నెంతకాల మాదృశ్యమును లోక

ము సహించి యుండఁగలను? ఈ యుద్ధభూమిపై మన రాజ్యలక్ష్మి విగతప్రాణయైవ్రాలుట నిశ్చయము! సత్యవతీ! నీవేల దుఃఖించెదవు? ఇది సంతోషకరమగు వార్త కాదా?

సత్య-సోదరా! సంతోషమెట్లగును?

అమర-ఎట్లందువా?

తే॥ గీ॥ చిక్కి, జీర్ణించి, శల్యావ । శిష్ట యగుచు
పరితిభఁ గోల్పడి, మంచంబు । బట్టియున్న
మహిత మేవాడ రాజ్య ర । మాలలామ
ఎంత కాల మీ బాధ స । హింప గలదు?

ఈ యుద్ధమునందా మరణ వేదనకు అంతముకలుగును. ఇది మనకు సంతోషకరమగు వార్తకాదా?

సత్య-అట్లైన నీ వీసారి యుద్ధమే చేయఁదలఁచు కొనలేదా?

అమర-యుద్ధము చేయకున్న మరి చేయునదేమి? యుద్ధము నిశ్చయముగ జరుగును. ఈ సారి యుద్ధమత్యంత విచిత్రమైనది! ఇది యన్నదమ్ముల పోరాటము! యావద్భారతదేశమును వేయికన్నులతో నీవేడుకను చూడ గలదు!

సత్య-ఈ యుద్ధమునకుఁ బాల్గొనుటకు జోద్పూర్ మహారాజగు గజసింహుఁడు కూడ మహబత్ఖాన్ వెంట వచ్చి యున్నాఁడని వినియుంటిని. ఆ రాజపుత్ర కులద్రోహి—

అమర-(ఆగ్రహోక్తిలో) ఏమంటివి సత్యవతీ! ఎన్నఁడును నీవట్లనగూ

డదు. "ఢిల్లీశ్వరోవా జగదీశ్వరోవా" యను మాట నీవు వినలేదా? అతఁడా జగదీశ్వర సమానుఁడగు ఢిల్లీశ్వరునకు పరమభక్తాగ్రగణ్యుఁడు; ఇన్నినిసములనుండి యును ఢిల్లీశ్వరుని దిరస్కరించి మన మీశ్వరద్రోహ మొంచితిమి!-గజసింహుఁడు! గజ...సింహుఁడు! ఓహో! ఏట్టిమహోత్తర నామము.

ఆ॥ వె॥ గర్భవైరులైన । గజమును సింహంబు
నొక్క రూపుఁ గాంచి । యుండె నహహ!
ఈ విచిత్ర జంతు । వివల తొండము నూచు
న వల రక్త వక్త్ర । మావులించు

సత్య-(ఉత్తేజితయై) రసపుత్రుఁడై యుండియును రసపుత్రుల తోఁడనే పోరవచ్చిన యీ కులద్రోహి మానసము పాషాణ నిర్మితము కదా?

అమర-(మందహాసము చేయుచు) ఏదియెట్లున్నను; అతఁడట్లుచే యకున్న యజ్ఞ మెట్లుసంపూర్ణముకాఁగలదు? సత్యవతీ? ఈ భారత వర్ష వినాశనమీ దేశపుసంతానము చేతనే యొనాదింపఁబడుట విధి నిర్ణీతమని నాయభిప్రాయము తక్షు! శిలను స్మరింపుము. జయచంద్రుని చరిత్రము జ్ఞప్తికి దెచ్చుకొనుము. మానసింహ శక్తసింహుల వృత్తాంతము దలంచు కొనుము. నేఁడు మహాబత్ఖాన్ గజసింహులను చూడుము. అంతయును యధోక్తముగ లేదా? దీని విషయమై మనకింక మనఃక్లేశమేల?-నీవింక

లోనికిఁబొమ్ము. నేనుమనసైన్యములను సిద్ధముచేసెదను.

సత్య-(నిష్క్రమించును.)

అమర-(స్వగతము) ఆహా!

మ॥ తులువల్ పాపులు మేర మీఱి శుచికిన్ ।
దూరస్థమై యేహ్యమై
మలినంబై క్రిమి సంకులంబగుచు సా ।
మ్రాజ్యంబు సర్వంబు దు
ర్బలమైనన్ దరిఁజూచి దుస్సహ మహా ।
వ్యాధుల్ సము ద్భూతమై
విలయాగ్నింబలె సర్వనాశనము గా ।
వించున్ గదా దేశమున్!

(ప్రవేశము-గోవిందసింగ్)

గోవి-(అభివాదము చేయును)

అమర-గోవిందసింగ్ ఏమిసమాచారము?

గోవి-రాణాజీ! నిరపరాధులగు గ్రామవాసుల గృహములను మహబత్ఖాన్ మంట పెట్టుచున్నాఁడు!

అమర-అగ్నిపాలనా? (మందహాసముచేయుచు) ఆతని జన్మము ధన్యమైనది!

గోవిం-ఇందులకు మనము ప్రతీకారము చేయవలదా?

అమర-అవశ్యము ప్రతీకారము చేయవలయును. చేయకున్న మేవాడకు సంపూర్ణ విధ్వంస మెట్లు సమకూరగలదు?

గోవిం-(చకితుఁడై) అట్లైన తామ యుద్ధముఁ జేయదలఁచుకొన్న లేదా?

అమర-గోవిందసింగ్ తప్పక యుద్ధము చేయుదము. మనసైన్యమింక నెంత మిగిలియున్నది? అయిదువేల సైనికులుం దురని తలంచెదను. అదియే చాలును. ఇంత కంటె నధిక మేల? మహబ్బత్ఖాన్ సైన్యమొక లక్షయుండునని వినియుంటిని. ఉండనిమ్ము. మన మేలభయపడవలయును.

గోవిం-(విచారముతో) మహారాజా! ఈయుద్ధమునందు మేవాడ రాజ్యమునకు సమూల వినాశనము నిశ్చయమని తోఁచుచున్నది.

అమర-అదేమి, గోవిందసింగ్! నీవు సహిత మధైర్యమొందు చుంటివా? ఇది మనకు శుభదినమని గ్రహింపుము. ప్రతిగేహమునందును మంగళ వాద్యములుమ్రోగనిమ్ము ప్రతిగృహో పరిభాగమునందును పతాకము లెగుర నిమ్ము. పౌరుష ప్రసిద్ధమైన యీ యుదయపురనగర మునందు, ఒక్కసారి,కడసారి, మేవాడ్ ప్రతాపచిహ్న మగు రక్తధ్వజము నెగురనిమ్ము. ఇంక నేటికి మూడవ నాఁడా పతాకనెచ్చటనుండునో తెలియదు.

గోవిం-(విచారముతో) మహారాజా! కొనయూపిరి యుండునంత వఱకు మనము ఖడ్గమును బరిత్యజింపము. రణభూమి పై ప్రాణత్యాగముఁజేయుటకు మనము సదా సిద్ధుల మే! కాని, యింతకాలమును మాతృదేశమునకై జీవ

రక్తమును ధారపోసియు, తుదకు విఫల మనోరథుల
మైతిమి కదా యను విచారము మాత్రమునాకుదుర్భర
మగుచున్నది!

అమర-(మందహాసము జేయుచు) గోవిందసింగ్ విచారమేల?

తే॥ గీ॥ శాశ్వతప్రాణి యొకడేని ♦ జగతిఁగలదె?
దైవఘటనచే నీనాఁడు ♦ చావకున్న
జనని తోఁడను మనమును ♦ చావనుంటి
మదియె మన జన్మసాఫల్య ♦ మగును గాదె!

గోవిందసింగ్! మరణించుటకు బూర్వ మొక్కసారి నాకు
సి గాఢాలింగన మొసంగుము. (కౌగలించుకొని)మంచిది. ఇంక
నీవు పోయి మన సైన్యములను సిద్ధము చేయుము.

గోవిం-(మెల్లగ నిష్క్రమించును.)

(ప్రవేశము—రాణి, రుక్మిణి)

అమర—రుక్మిణీ! ఈ దినము మన జీవితములయందత్యంత శుభ
దినము.

రాణి—ఏమి? మానసికి వివాహము నిశ్చయమైనదా?

అమర—మానసికి వివాహము కాదు. మేవాడకు వివాహము!

రాణి—(విస్మయముతో) మేవాడకు వివాహమా! అదెట్లు?

అమర—మన మేవాడ రాజ్యలక్ష్మి నేఁడు పెండ్లికుమార్తెయ
గును! విధ్వంసము పెండ్లి కుమారుఁడు! ఇరువురకును
నేఁడు వివాహమహోత్సవము జరుగును.

రాణి—(విస్మయముతో) మీ మాటలయర్థము నాకు తెలియు లేదు.

అమర—అర్థము తెలియుటలేదా? చాల యుద్ధమున్నది! గొప్ప యుద్ధమున్నది! సోదరులకు యుద్ధము!... నేడు మనకు మహోత్సవము!... వివాహమగును!... వివాహ మగును!... ...

(నిష్క్రమించును.)

(ప్రవేశము. మానసి)

మానసి—[ఆత్రముతో] అమ్మా! నాయనగారికేమైనది? ఉన్మత్తునివలె నారిటునటుఁ దిరుగుచున్నారు! కారణమేమి? వారికి నేఁడేమి సంభవించినది?

రాణి—(భయముతో) మానసీ! నాకేమియుఁ దెలియుటలేదు. వారికేదియో పిచ్చి పట్టినట్లున్నది! రమ్మా పోయి చూతము.

(నిష్క్రమింతురు.)



## దృశ్యము 3.

స్థానము:—మేవాడ యందలి యొక పల్లె దారి.

[ప్రవేశము సత్యవతీ, ఆమెపుత్త్రుఁడు అరుసింహుఁడు]



సత్య—అరుణా!

అరుణ-ఏమమ్మా!

సత్య—నడచుట నీకు కష్టముగానున్నదా?

అరుణ-లేదమ్మా ఈ యూపుప నెంతదూరమైనను నేనునడువఁ
గలను.

సత్య-నేఁడు మనమీ పల్లెయందు విడియుదము

అరుణ-ఏల? మనకేమిపని యున్నది?

సత్య-పనియున్నది. ఈ పల్లెయందలి ప్రజలను సిద్ధముచేయవల
యును.

అరుణ-ఎందులకు?

సత్య—యుద్ధమునకు! యుద్ధమునకు! సిద్ధము చేయవలయును.

తే॥ గీ విజయ ఖనియైన మేవాడ ♦ వీరకులము
మొగ్గరంబున నిశ్శేష ♦ ముగ నశించె!
ఇంక నూతన యోధులన్ ♦ సృష్టి చేయ
వలయు సంగ్రామ కార్య ని ♦ ర్వహణమునకు

ఈ యుత్తమకార్యమును మనము చేయుదము. ఇచ్చటి ప్రజలను ప్రబోధించి యుద్ధభూమికిఁ బంపుదము. రమ్మా. సంధ్యాకాల మాసన్నమైనది.

[ఇరువురును నిష్క్రమింతురు.]

[ఇంకొకవైపునుండి కొందరు పురజనులు ప్రవేశింతురు.]

మొదటి—మన మేవాడ భూమి యీనాటితోఁ దుడిచికొని పో
వుట నిశ్చయము!

రెండవ—సందేహమేమి? ఈసారి మహబత్ఖాన్ యుద్ధమునకు వచ్చియున్నాఁడు.

మూడవ—ఏమి! మహబత్ఖాన్ అంత గొప్ప యోధుఁడా? అఁ! మొన్న మొన్న నాకన్నుల యెదుటఁ బుట్టినాఁడు! యుద్ధ మెప్పుడు నేర్చుకొనెను.

నాల్గవ—వయసున కొద్దివాఁడైనను యుద్ధమెఱుఁగఁడని సిద్ధాంతమా?

మొదటి-[ఒకప్రక్కనుఁజూచుచు భయభ్రాంతుఁడై] అయ్యో! అయ్యో! అటు చూడుఁడు! అటుచూడుఁడు! ఆపల్లె తగుల బడుచున్నది!

అందఱు—[భయముతో] ఎక్కడ? ఎక్కడ? ఏదీ? ఏదీ?

మొదటి—అదిగో! అదిగో! అటు చూడుఁడు! ఆమూటలు చూడుఁడు. ఆ పల్లెవాండ్ర యార్తనాదములు వినుఁడు

అందఱు-[వినుట నభినయించి] ఔనౌను పాపము!

రెండవ—అదిగో! అదిగో! చూడుఁడు పల్లెవాండ్రెల్లు హాహాకారములు చేయుచు గుంపులు గుంపులుగా నీవైపునకు వచ్చుచున్నారో!

మూడవ-వారివెంటనే, పాపము, వారిని వెంబడించుచు మొగల్ సిపాయిలు తుపాకులను పేల్చుచునారు.

[ తెరలో ]

అయ్యలారా! అయ్యలారా! మేము నిరపరాధులమగు పౌరులము. మమ్ము జంపకుఁడు. మమ్ముఁజంపకుఁడు.

(కల్యాణి, అజయసింహుఁడు, ప్రవేశింతురు.)

అజయ-(పౌరులనుద్దేశించి) పౌరులారా! ఇచ్చట నిలువఁబడి యేమి చూచుచున్నారు? ప్రాణాపాయమునందున్న యా నిర్భాగ్యులను మీరు పోయి రక్షింపలేరా?

అందఱు—అయ్యా! మేమేమి చేయగలము?

అజయ—అట్లైన మీరు జీవచ్ఛవములవలె నిలువఁబడి సోదరులకు జరుగుచున్న యీ యత్యాచారమును గన్నులార జూచుచు నూరకుండెదరా?

మొదటి—లేకున్న వారితో మేముకూడఁ బడి చావవలయునా? ఓరీ! రండు, రండు, వారీవైపునకే వచ్చుచున్నారు! మనము మనప్రాణముల దక్కించుకొందము రండు.

కల్యా—ఓరీ! మూర్ఖులారా! మీరు పరువిడి పోయినంతమాత్రమున, మీ ప్రాణములు నిలిచిపోవునా? మీ వంతు కూడ వచ్చుచున్నది. ఈ దవాగ్ని జ్వాలలబారిపడకుండ మీరు తప్పించుకొనఁ జాలరు. ఇంక నొక్క ఘడియలో మీ గృహములు కూడ దగ్ధము కానున్నవి.

రెండవ—అప్పటి మాట చూచుకొందము రండు, రండు.

(అందఱు పౌరులు నిష్క్రమింతురు)

అజయ-(ప్రక్కకుఁ జూచుచు) ఆ నిర్భాగ్యపౌరుల యార్తనాదము లంత కంతకు సమీపమున వినవచ్చుచున్నవి. సోదరీ! కల్యాణీ! నీ వించుక తొలఁగి మాటున నిలు

నంబడి యుండుము. నేను వీరి సహాయార్థమై పోయె
దను.

(కల్యాణి ప్రక్కకు తొలఁగును! మఱియొక ప్రక్కనుండి
కొందఱుపౌరులు రోజుకొనుచు ప్రవేశింతురు. వారి వెనువెంటనే
విచ్చుకత్తులతో కొందఱు మహమ్మదీయ సైనికులు ప్రవేశిం
తురు.)

పౌరులు-మహాప్రభూ! రక్షింపుడు. రక్షింపుడు.

(అజయ సింహుని పాదములపైఁ బడుదురు.)

అజయ-పౌరులారా! భీతిల్లకుఁడు! భీతిల్లకుఁడు! నాకంఠమునఁ
బ్రాణములుండు నంత వరకు మీకెట్టి యాపదయు
రాజాలదు. (సైన్యముతో) ఓరీ! మ్లేచ్ఛులారా! జీవితేచ్ఛ
యున్నచో మఱలిపొండు.

సైనికులు-(అకదఱును అజయసింహునిపైఁ బడుదురు. పోరాట
మునందు సైనికు లొక్కరొక్కరు నేలఁ ద్రాలుదురు.
ఇంతలో మరికొందరు సైనికులు ప్రవేశింతురు.)

అజయ—కల్యాణీ. కల్యాణీ! ఇంక రక్షణమసాధ్యము పరువెత్తు
కొనిపోయి నీవు నీ మానమును రక్షించుకొనుము.

కల్యా-[ముందునకు వచ్చి] సోదరా! ఇచ్చట నీవు శత్రుహస్త
ముల మరణింప నుండ నేను నిన్ను విడచి పోవుదునా

అజయ—వలదు, కల్యాణీ! [తటాలున నొక తుపాకి గుండు
తగులును.] హా! హా! హా! ఎవ్వఁడీ భీరువు? ఎవ్వఁడు
భీరువు! [నేలఁద్రాలును.]

కల్యా-[మిక్కిలి యాత్రిముతో] అజయా! అజయా! ఏమైనది?
ఏమైనది?

అరవ, సిపాయి—అరే, యే కోసేరి? పక్డో! పక్డో!

గొండప—నహీం! నహీం! ఇదీ ఔరత్! హాడం గుల్కీ హానీ
మత్ కరో అని సర్దార్ కా హుకుం!

అజయు—(హీనస్వరమున) కల్యాణీ!...కల్యాణీ! నీవు...నాకై
దుఃఖింపకుము. నేను...వీర మరణమునే...పొందు
చుంటిని. దుఃఖింపకుము. సోదరీ!...నేను...పోవుచు
న్నాను!...ఈ మ్లేచ్ఛహాతకుల...బారినుండి....ఈశ్వ
రుఁడు....నిన్ను...రక్షించుఁగాక! హా...హా...సెల
విమ్ము...సోదరీ!... సెలవిమ్ము.

(మరణించును.)

కల్యా-(రోదనము చేయుచు) హా! హా! సోదరా! సోదరా!
అనాథనగు నన్ను విడచి నీ వెచ్చటికిఁబోయితివి?

(అజయసింహుని మృతదేహముపై వ్రాలును.)

సిపాయి- హొక్కడీక్కా ఫోతాడ్?(ఆకసము జూపుచు)హొక్కడీక్కా
హాక్కడీక్కా!ఫోతాడ్ (తక్కినసైనికులతో)ఛలోరేఛలో

కల్యా—(ముక్త కేశినియై లేచి, తీవ్రముగఁ జూచుచు) ఓరీ
యమదూతలారా! రక్తపిసాసులగు నరపశువులారా!
మీ రేవ్వరి యాజ్ఞపై నాసహోదరుని హత్యగావించి
తిరి? ఏ యధమాధముఁడు మీకు సేనాధిపతియై నరక
మార్గమున నడచుచున్నాఁడు?

సిపాయి-మాదీ సేనాపత్తీ నీకూ తెల్దూ?- మహాబత్ఖాన్ సాహెబ్! పేరూ సెప్తే పిట్టల్ నీరు తాగవ్!

కల్యా-ఆ నీ యాజ్ఞయా యిది? మంచిది నడువుఁడు నేను సహితము వెనువెంట వచ్చెదను. సన్నాతని కడకుఁ గొని పొండు.

రెండవసిపాయి-క్యా. క్యా? నిన్ను హాక్కడ్కి తీసుకపోయి పీకమీాద్కి ఖత్తీ తెచ్చూకుంటాం?

మూడవసిపాయి-దాన్కి హాదీ వొస్తే మన్కి హేమీా భే? రానీ (కల్యాణితో) అచ్ఛా, ఆవ్!

కల్యా-నడువుఁడు.

[అందఱు నిష్క్రమింతురు.]

దృశ్యము 5.

స్థానము:—మహబ్బత్ఖాన్ డేరా.

[ప్రవేశము—మహాబత్ఖాన్, గజసింహుఁడు.]

గజ-తనసైన్యము వెంట రాణా అమర సింహుఁడు సహితము యుద్ధభూమికి వచ్చియుండెనా?

మహ-వచ్చి యుండెను; కాని, ఆతఁడొక్కఁడే తిరిగి యుద్ధ భూ

మినుండి యింటికిఁ బోయెను. ఆతని యైదువేల సైన్య మునందును సుమారు నాలుగు వేల మంది రణభూమి పై మడసిరి.

గజ—కేవల యైదువేల సైన్యముతో లక్షాధికమగు మొగలా యి సైన్యము నెదుర్కొనుటకే రాణా అమరసింహుఁ డు సాహసించెనా? ఎట్టి సాహసము?

మహ-ఔను. అది నిశ్చయముగ సాహసకృత్యమే. కాని, మహారాజా నేడు నాకొక విషయము జ్ఞప్తికి వచ్చు చున్నది!

గజ-సెలవీయుఁడు.

మహ—నేను ప్రస్తుతము ముసల్మానుఁడనే యైనను, ఒకప్పుడు రసపుత్త్రుఁడనై యుంటిననియు, ఈ మేవాడ రాణా అమరసింహునకు సహోదరుండననియు, నాకు మరి యొకసారి జ్ఞప్తికి వచ్చినది! అయిదువేల సైనికులతో లక్షాధికమగుశత్త్రుసైన్యము నెదుర్కొనుటకుఁబూను కొనిన యాతఁడు తప్పక మృత్యువునకు సిద్ధపడియే వచ్చి యుండును! మహారాజా! రాజపుత్త్రి శౌర్య జ్యోతి కింత కంటె తార్కాణమేమి కావలయును.

గజ—నిశ్చయము.

మహ-నేను హిందూమతమును బరిత్యజించి, రాజపుత్త్రిత్వము మును విడచిపుచ్చి ముసల్మానుఁడ నగుటచే ఈ పైశా చిక కృత్యములు నాకంత దుఃఖకరములుగా లేవు! కాని,

సిపాయి-మాదీ సేనాపత్తీ నీకూ తెల్సూ?— మహబత్ఖాన్ సాహెబ్! పేరూ సెప్తే పిట్టల్ నీరు తాగవ్!

కల్యా-ఆ నీ యాజ్ఞయా యిది? మంచిది నడువుఁడు నేను సహితము వెనువెంట వచ్చెదను. నన్నాతని కడకుఁ గొనిపొండు.

రెండవసిపాయి-క్యా. క్యా? నిన్ను హాక్కడ్కి తీసుకపోయి పీకమీాద్కి ఖత్తీ తెచ్చూ్కుంటాం?

మూఁడవసిపాయి-దాన్కి హదీ వొస్తే మన్కి హోసూ ఛే? రానీ (కల్యాణితో) అచ్ఛా, ఆవ్!

కల్యా-నడువుఁడు.

[అందఱు నిష్క్రమింతురు.]



## దృశ్యము 5.

స్థానము:—మహబత్ఖాన్ డేరా.

[ప్రవేశము—మహబత్ఖాన్, గజసింహులుఁడు.]



గజ-తనసైన్యము వెంట రాణా అమరసింహుఁడు సహితము యుద్ధభూమికి వచ్చియుండెనా?

మహ-వచ్చి యుండెను; కాని, ఆతఁడొక్కఁడే తిరిగి యుద్ధ భూ

మినుండి యింటికిఁ బోయెను. అతని యైదువేల సైన్యమునందును సుమారు నాలుగు వేల మంది రణభూమి పై మడసిరి.

గజ—కేవల మైదువేల సైన్యముతో లక్షాధికమగు మొగలాయి సైన్యము నెదుర్కొనుటకే రాణా అమరసింహుఁడు సాహసించెనా? ఎట్టి సాహసము?

మహ—ఔను. అది నిశ్చయముగ సాహసకృత్యమే. కాని, మహారాజా నేడు నాకొక విషయము జ్ఞప్తికి వచ్చుచున్నది!

గజ—సెలవీయుఁడు.

మహ—నేను ప్రస్తుతము ముసల్మానుఁడనే యైనను, ఒకప్పుడు రసపుత్త్రుఁడనై యుంటిననియు, ఈ మేవాడ రాణా అమర సింహునకు సహోదరుండననియు, నాకు మరియొక సారి జ్ఞప్తికి వచ్చినది! అయిదువేల సైనికులతో లక్షాధికమగుశత్త్రుసైన్యము నెదుర్కొనుటకుఁబూనుకొనిన యాతఁడు తప్పక మృత్యువునకు సిద్ధపడియే వచ్చి యుండును! మహారాజా! రాజపుత్త్రి శౌర్యజ్యోతి కింత కంటె తార్కాణమేమి కావలయును.

గజ—నిశ్చయము.

మహ—నేను హిందూమతమును బరిత్యజించి, రాజపుత్త్రిత్వమును విడచిపుచ్చి ముసల్మానుఁడ నగుటచే ఈ పైశాచిక కృత్యములు నాకంత దుఃఖకరములుగా లేవు! కాని,

మీరిప్పటికిని హిందువులై యుండియును, రాజపుత్త్రులై యుండియును, ఇట్టి యమానుష వృత్తికిఁ బాల్పడుట మీకు లజ్జాకరముగ లేదా? నేను పూర్వాశ్రమమున రాజపుత్త్రుఁడను. ప్రస్తుత నాయాశ్రమము మాఱిపోయినది. అయినను, నేనొకప్పుడేనియు రాజపుత్త్రుఁడనై యుండినందులకు నిశ్చయముగ గర్వించుచున్నాను.

గజ-పోనిండు ఈ వితర్కము మనకిప్పుడేల?—రాణా అమరసింహుఁడొక్కఁడే యుద్ధభూమి నుండి మఱలి పోయెనని చెప్పియుంటిరి!- ఆతఁడు మనచే బాధింపఁబడియుండ లేదా?

మహా-లేదు. ఆతని కెట్టి హానియు, నెట్టి యవమానమును జరుగరాదని నేను ఆజ్ఞాపించి యుంటిని. మహారాజా!

తే॥ గీ॥ ధైర్యసాహసముల శ్రీ ప్ర। తాపసింహు
పుత్త్రుఁడని పించు కొనినట్టి। శత్రురాజు,
జ్ఞానశూన్యులౌ మన యట్టి। జడుల కెల్ల
మార్గ దర్శకుఁడై ధాత్రి। మనఁగ వలదె?

గజ-నిశ్చయము—నాకిక సెలవొసంగుఁడు.

మహా—మంచిది.

(గజసింహుఁడు నిష్క్రమించును.)

మహా-(ప్రక్కకుఁ జూచుచు) అదిగో! అనతి దూరములో పల్లెటూళ్లు తగులఁబడుచున్నవి! ఓహో! పురజనుల

హాహా కారము లెంత చేరువను వినఁబడుచున్నవి! - ఓరీ! హింసువులారా! ధర్మము పేరిట నధర్మకృత్యము లొనర్చుచున్న యోనరపిశాచములారా! మరణింపుఁడు. మరణింపుఁడు! మీ మతము యొక్క పేరు చెప్పుకొనుచు నీ యగ్ని జ్వాలలఁబడి మరణింపుఁడు నేఁడు మీ యహంకారము చూర్ణము కావలయును. మీ దుర్మతము భస్మీభూతము కావలయును.

ఉ॥ మలమల మాడి మాడి యణు ।
మాత్రము నిల్వక బుగ్గి కండు మీ
కులమును మీరు నీ జ్వలిత ।
ఘోర నిరంకుశ వహ్నికీలలన్;
విలయ భయంకరాగ్ని యిది ।
భీరువులార! త్రినేత్రుఁ డడ్డినన్
నిలువను మీ కులాంతకము ।
నేఁడొనరింపక నిశ్చయంబుగన్!

(ప్రవేశము-నలువురు సిపాయిలతో)

మహా—ఈమె యెవరు?

మొదటిసిపాయి-సర్కార్, ఈమె యెవ్రో మాకూ మాలుం నహీం, రస్తా మే మాకూ కల్సింది, మా యెన్కా వచ్చింది,

మహా—(కల్యాణితో) నీవెవ్వరు?

కల్యా-నే నెవరినో తెలిసి కొనిన ప్రయోజనముమీకు లేదు!

మహా-మంచిది. మాయొద్ద మీకేమి పని యున్నది?

కల్యా-నేను మీతో నొక్కవిషయమున న్యాయాన్యాయ విచారముఁ గావింప దలంచి వచ్చితిని.

మహా-ఏ విషయమున?

కల్యా-ఈ సైనికులు నిరపరాధి యగు నా సోదరుని హత్య కావించితిరి. అందులకు మీయనుజ్ఞ గైకొంటి మని చెప్పిరి.

మహా-ఎట్లు? నీ సహోదరుని ఈ సైనికులు, నా యనుజ్ఞపై హత్య గావించిరా? (సైన్యముతో) సైనికులారా, ఈమె వాక్యములు యథార్థములా?

మొదటిసిపాయి-ఠీక్ హై సర్కార్ దీన్కి భాయీ అంటుంది ఎవోమాటా తెల్డూ, మాతో లడాయ్ సేసీ; అలడా య్‌మే మర్గయా ఆయినాడ్.

మహా-(కల్యాణితో) వీరు పల్కినది సత్యమేనా?

కల్యా-సత్యమే. మీ సైనికులు నిర్దోషులగు పౌరులను హత్య గావించుచుండిరి. నాసోదరుఁడా నిరపరాపరాధులగు పౌరులను రక్షింప యత్నించెను.

మహా-అట్లైన, ఆతఁడు యుద్ధమున మరణించె నన్నమాట వీరి యపరాధమేమున్నది.? వీరికి నే నట్టి యాజ్ఞ నొసంగి యుంటిని. సైనికులారా! మీరింక పోవచ్చును.

(సైనికులు నిష్క్రమింతురు.)

కల్యా—మీరు నిరపరాధులను నిర్దాక్షిణ్యముగ హత్యగావింప నాజ్ఞాపించితిరా?

మహా-ఔను.

కల్యా-పల్లెలను తగులఁబెట్టు రాక్షస కృత్యములుకూడ మీయాజ్ఞ యే యగునా?

మహా-ఔను.

కల్యా—నేను నమ్మజాలను. నేను నమ్మజాలను. ఇట్టి యమానుష కార్యములకు మీయనుమతి యుండజాలదు.

మహా-(విస్మితుఁడై) నావిషయమై నీవిట్లు తలంచుటకుఁగారణమేమి?

కల్యా—నాస్వామి, నాప్రాణపతి, ఇట్టి ఘాతుకములకుఁ బాల్పడఁజాలఁడు.

మహా-(మహాశ్చర్యముతో) నీ స్వామియా? నీ ప్రాణపతియా? ఎవరు నీ ప్రాణపతి?

కల్యా—ప్రభూ! మీరు నన్ను గుర్తింపలేదా? నేను మీ పరిత్యక్త హిందూయువతిని! కల్యాణిని!

మహా-(అతివేగముగ) ఏమీ! ఏమీ! నీవు కల్యాణివా! కల్యాణివా? అట్లైన నీ సహోదరుఁడగు అజయసింహునినా నాసైనికులు హత్యగావించితిరి?

కల్యా-ఔను. ఏ దినమున నేను సతీత్వ ధర్మమును గుర్తెఱింగి మిమ్ములను నా హృదయ సీమను నిలిపి, మీ యందలి ప్రేమను నా మార్గజ్యోతిగ గ్రహించి, తండ్రి యాగ్ర

హామునకుఁ బాల్పడి, గృహ పరిత్యాగ మొనర్చి వెడలి వచ్చితినో, నాఁడే నా సహోదరుఁడగు అజయసింహుఁడు నాయందలి యభిమానముచే, పితృవాక్యమును దిరస్కరించి: నా సహాయార్థమై నా వెనువెంట వచ్చెను. అట్టి దివ్య ప్రేమ స్వరూపుఁడగు నా సహోదరుని ప్రాణములను కరుణాలేశము లేక మీరు హరించితిరి! నాధా! ఇంక నేనేల జీవింపవలయును? మీ చేతులతోఁడనే నన్ను సహితము వధించి వేయుఁడు.

మహా—కల్యాణి! నా సైనికుల అత్యాచారమునకు నీవు నన్ను క్షమింపుము.

కల్యా—వలదు, వలదు, క్షమాగుణము మీయందువలెనే నాయందు సహితము నశించినది. మీయందు వలెనే నాయందు సహితము మానుష ప్రవృత్తి నశించినది. నిరపరాధులగు నిరంధిప్రజలను మీరు హత్యగావించితిరి. ఆరక్త పిపాసమగు మీ ఖడ్గమును గైకొని యీ యబలను సహితము వధించి పుణ్యము గట్టుకొనుఁడు

మహా-కల్యాణీ! రసపుత్ర కుల వినాశముఁ జేయఁదలఁచి నే నట్లాజ్ఞాపించితిని—కాని-

కల్యా—వలదు. నేనేమియును-వినఁదలఁచుకొనలేను. ఓహో ఎట్టి విద్వేషము! ఎట్టి బాధు ద్రోహము! ఎట్టి రక్తదాహము! ఈతఁడా నా యారాధ్య దేవత? ఈ ఘాతుకుని స్మరించియా నేను నిష్ఠురమగు నీ సన్యాసినీ వ్రత

మును బూనితిని? ఈ కుత్సితుఁడా నాబహిఃప్రాణమని
నేను నమ్మియుంటిని? -

మహా— కాని, కల్యాణీ. నా యాజ్ఞకుఁ గారణము

కల్యా— వలదు. వలదు. ఆ కారణము నేను వినఁదలఁచు కొన
లేను. నాహృదయము మహాభంగమైనది! ఇన్ని దినము
లనుండియు మిమ్ముఁ బ్రేమించుచుంటిని! పూజింపుచుం
టిని! కాని, నేటినుండియును మీరు నాకు పరమ శత్రు
వులని గ్రహించుఁడు. ఈ దేశమాత విశుద్ధ గర్భమున
జన్మించి యుండియును, సుక్షాత్ర రక్తము మీ రక్తనా
ళములఁ బ్రవహించుచుండినను, ఎట్టి రాక్షసకృత్యమున
కియ్యకొనిరి! తుచ్ఛమగు ధనలోభమున, నికృష్టమ
గు విద్వేషమున, స్వజాతి విధ్వంసమునకుఁ బాల్పడిన
పాషాణహృదయులు మీరు! మ్లేచ్ఛుల యుచ్ఛిష్టము
భుజించి మాంస లోలములగు నరకుక్కురములను నిర
పరాధులగు ప్రజలపై నుసిగొల్పిన ఘాతుకాత్ములు
మీరు! మేవాడదేశమును శ్మశానముగావించి స్వేచ్ఛా
విహారమొనర్చుచున్న పిశాచప్రాయులు మీరు!
ఓ జగదీశ్వరా! ఆర్తరక్షకా! ఇట్టి దేశ ద్రోహులకు
తగిన దండనము నీయొద్ద లేదా! ఆకాశగోళమునుండి
దుర్నివారమగు వజ్రపాతము సంభవించి యీ నరహం
తకుని మస్తకము నింకనేల భిన్నభిన్నముచేయకున్నది?

మహా—కల్యాణీ! ఈ యుద్ధమునందు నేను పాల్గొనుటకుఁ గార ణము నీవే యని యెఱుంగుము

కల్యా—కారణము నేనా? ఎట్లు?

మహా—ఏనాఁడు నీతండ్రి గోవిందసింగ్ నాయెడల ద్వేషము వహించి, నిన్నుఁ దనయింటి నుండి వెడలించెనని విని యుంటినో యానాఁడే హిందూమత విధ్వంసమునకుఁ నే నస్త్ర ధారణ మొనర్చితిని.

కల్యా-మంచిది. అట్లైన, ఏన్యాయ శాస్త్రము ననుసరించి, యొకా నొక ప్రత్యేకవ్యక్తి యపరాధమునకు మీరు జాతి నంతయు నాశనముఁ జేయ సంకల్పించుకొంటిరి?

మహా-కల్యాణీ! ఇందాశ్చర్యమేమున్నది? ఒక్క-రావణునియప రాధమునలంకారాజ్యము విధ్వంసముకాలేదా?ఒక్క-దు ర్యోధనుని మూఢత్వమున ధార్తరాష్ట్రవంశము దగ్ధ ముకాలేదా" ఇందసంభవ మేమున్నది హిందూప్రజా కోటి జాతి గత విద్వేషమునకు నీ తండ్రి యగు గోవిం దసింగ్ ప్రతినిధియై నిలచెను. నేనా విద్వేషమునకుఁ బ్రతీకార మొనర్పఁబూనితిని.

కల్యా—అది నేను విశ్వసింపఁజాలను.మీయందలియహంకారమే మీ చేత నిట్లు గావించినది. ఈ వ్యక్తి గత దోషమున మీరు మేవాడపై నగ్నివర్షముఁ గురిపించితిరి? ఇదియా మీ ధర్మము? ఇదియా మీశూరత్వము?మీరునాపతి యనియు, నేను మీ సతి ననియు నేటి దనుక నూ

హించి యుంటిని. కనుక నేటి నుండియును మన కెట్టి బాంధవ్యమును లేదు. మీకును నాకును మధ్యనిప్పుడొక ప్రవాహము ప్రవహించుచున్నది.! నా స్వదేశీయుల రక్తనిధి ప్రవహించుచున్నది! నా సహోదరుని మృత శరీరమా నదియందు దేలుచున్నది! ఓ దేశద్రోహి! విధర్మి! నరహంతకా! మనకింక నెట్టి బాంధవ్యమును లేదు. నీ యట్టి నరాధములను గాంచినచో, ఈశ్వరుని దయాళుత్వమునందు సహితము నాకు విశ్వాసము నశించును.

(నిష్క్రమించును.)

మహా—(నిర్విణ్ణుండై చూచుచుండును.)

[తెరజారును.]

చతుర్థాంకము సంపూర్ణము.



# మేవార్ పతనము.

## —♦ పంచమాంకము. ♦—

### దృశ్యము 1.

స్థానము:—ఉదయ పురమునందు రాజభవనము.

(రాజకుమారి మానసికూర్చుండి పాడుకొనుచున్నారు. కొంతసేపైన పిమ్మట రాణా అమరసింహుడు ప్రవేశించును)



మానసి-(పాట చాలించి లేచి) నాయనా! వచ్చితిరా! యుద్ధ భూమి నుండి తిరిగి వచ్చితిరా!

అమర—ఔనమ్మా! ఈ సారి యుద్ధభూమి యందు నేనొక యత్యాశ్చర్య కరమగు విశేషమును జూచితిని.

మానసి—ఏమి? ఏమి చూచితిరి? యుద్ధమునందు——

అమర—కాదు మానసీ! ఈ సారి యుద్ధమే జరుగలేదు.

తే॥ గీ॥ కాలమేఘా వృతంబయ్యె । గగన తలము!
భూ నభోంతరాళమునందు । పొగలు గ్రమ్మె!
అంతలోసర్వ విశ్వ భ । యంకరముగ
సమర భూమిపై నగ్ని వ । ర్షంబుకురిసె!

ఆ మహా వహ్ని వర్షమునందు మనసైన్య మంతయును నిశ్శేషముగ దగ్ధమై పోయినది?

మానసి-(చకితయై) ఎట్లు? ఎట్లు?

అమర—మానసి! ఆ భయంకర దృశ్యము ఈ ప్రపంచమునం బంధ మగునది కాదని నా విశ్వాసము! ఉల్కావృష్టి నిరంతరాయముగఁ గురియు చుండెను! అగ్నిజ్వాలలు నన్ను జుట్టు ముట్టుచుండెను. క్షణ మాత్రమున నేను కన్నులు మూసి కొంటిని! నా శరీరమునఁ జైతన్యము తప్పిపోయినది! నాకు తిరిగి చైతన్యము వచ్చి,కన్నులు విప్పి చూచుకొను సరికి రణక్షేత్రమున నేనొక్కఁడను మాత్రమే మిగిలి యుంటిని! నాచుట్టును చూపుమేర దూరము మృతకళేబరములు అసంఖ్యాకములుగ బడి యుండెను! అది యెట్టి దృశ్యము! ఎట్టి భీషణదృశ్యము ఓహో! తలఁచుకొనిన నాదేహము ఆ పాద మస్తక మును బులకాంకురిత మగుచున్నది. ఎట్టి భయానక దృశ్యము. ఎట్టి భయానక దృశ్యము?

[శూన్య దృష్టులఁ జూచును.]

మానసి—తండ్రీ! మీ చిత్తము చంచలావస్థ యందున్నది! క్షణ మాత్రము విశ్రమించుఁడు. నేను మీకు సేవఁజేసెదను.

అమర-(వినిపించు కొనకయే) ఆ స్మశాన భూమియందు కేవల ము నేనొక్కఁడను మాత్రమే సంచరించుచుంటిని. శత్రువులెవ్వరును నన్నెదుర్కొన లేదు.

మానసి-అట్లయిన, మీరు పరాజయమున కొప్పుకొంటిరా?

అమర-నే నొప్పుకొనునదేమి? ఒప్పుకొనకున్న దప్పునా?— కాని, వారేల నన్నెదుర్కొనలేదు? ఆ రుద్రభూమి యందు నేను "మహబత్ఖాన్ గజసింహా" అని కేక లిడుచు పిచ్చి పట్టినవానివలె నిటు నటుఁ బరుగు లెత్తితిని. నా కేక లరణ్యరోదనములైనవి. నా యొద్ద కెవ్వరును రాలేదు. మానసీ! నే నేకాకినై యుండినను శత్రువు లెవ్వరును నాయొద్దకు రాకుండుటకుఁగారణము నీ వూహింపఁగలవా?

మానసి-తండ్రీ! ప్రస్తుతము నీ చిత్తమించుక వికలమైయున్నది! ఒక్కింత సేపు విశ్రమించుఁడు. పిమ్మట సర్వమును తెలియును.

అమ-(వినిపించు కొనకయే) మఱియొక చిత్రము! మహబత్ఖాన్ యుద్ధమునందు జయమందినను,ఇంక నేల నతఁడు విజయ ఘోషమొనర్చుచు గర్వోద్రేకమున నీ యుదయపుర దుర్గమునందు బ్రవేశింప లేదో తెలియకున్నది. అతఁడు వచ్చి దుర్గాధి పత్యమును స్వీకరించుటయే మిగిలి యున్నది? నేను పరాజయ మొందితిని?

మానసి-అయిన నేమి తండ్రీ! ఇందు దుఃఖింప వలసినదేమి కలదు? యుద్ధమునందు ఉభయపక్షములును విజయ మొందునా? విజయ మొకరికిఁ జేకూరిన, పరాజయమిం కొకరికిఁ గల్గును! ఇంతకు జయాపజయములు దైవ

నిర్ణయములు కదా? దీనికై విచారింపనేల?

అమర-(మెల్లఁగా) నిశ్చయము! జయాపజయములు దైవనిర్ణయములు! ఇందు విచారింప వలసిన దేమియు లేదు. కాని మానసి! శత్రువులు వచ్చి యేకాకినైయుండిన నన్ను బంధించి వధింపకుంటిరేల?

(ప్రవేశము రాణి—రుక్మిణి)

అమర—(రాణీతో) రుక్మిణీ! గొప్ప సమస్య సంభవించినది. నీవు యేమైన యోచింపఁ గలవా?

రాణి—ఏమి సమస్య?

అమర-(వెఱ్ఱి చూపుఁ జూచుచు) వారు నన్నేల బంధింపలేదు! ఏల వధింపలేదు?

రాణి—(భయముతో మానసి వైపుఁ జూచును)

అమర-ఇటు వినుము. ఆ గంభీర నిశాసమయమున ఆ యుద్ధభూమిపై ఆ పీన్గు పెంటల నడుమ, నేను నిలువఁబడి యుంటిని! మీఁద ఆకాశమునందలి యనంత నిశ్చల తారా గణములు! క్రింద భూతలముపై అసంఖ్యాక మృత కళేబరములు! ఆ రెండిఁటికిని నభేధ్యమగు నంధకారము! అంతయు అగమ్యగోచరమై యుండెను! నాకును ఈ బాహ్య ప్రపంచమునకును, ఎట్టి సంబంధమును లేనట్లుండెను! నేను జీవన్మరణావస్థ యందుంటిని! జీవించియే యుంటినో, మరణించితినో, కూడ నేను గుర్తింపలేక పోయితిని! అట్టి విచిత్రావస్థయందు నేను

నా ఖడ్గము నొక్కసారి ఝుళిపించితిని. కాని, నా ఖడ్గ ఘాతము కేవలము శీతల వాయువును మాత్రమే ఛేధింపఁగల్గెను. అంత నే నెలుగెత్తి యొక్కసారి మహాబత్ఖాన్ ” యని యఱచితిని; కాని, నా కంఠస్వరము నలు దిక్కులకును వ్యాపించి తిరిగి వ్యర్థమై నాయొద్దకే వచ్చెను! (భగ్నస్వరమున) పిమ్మట ఆ యంధకారమయమైన రణక్షేత్రమున, నాల్గు వైపులకును నా దృష్టిఁ బ్రసరించితిని. ఆకాశమునందలి నక్షత్ర కాంతి మాత్ర మించుక భూమికిఁ దెలివిఁ గూర్చుచుండెను. అంతట, ఆ నక్షత్ర ప్రకాశము నందు నేనొక యత్యద్భుతదృశ్యమును గాంచితిని. సువర్ణ గర్భయగు నీ మేవాడ రాజ్యము ప్రళయ కాల భూకంపముచే నష్టభ్రష్ట యగుటఁ గాంచితిని. పిమ్మట నా ప్రదేశము నందలి శీతల వాయువు మృత సైనికుల జీవాత్మలచే బరువగు చుండినట్లు తోచెను! అత్యంత ప్రయాసమున నే నొక దీర్ఘ నిశ్వాసమును విడచితిని. ఆ నిశ్వాసము సహితము పైకెగయక బరువై మఱల క్రిందికే వచ్చినట్లు పొడగట్టెను! అప్పు డంధకారము లేకుండిన నా నిశ్వాసమును నేను భూమిపై నుండి మఱల మీదికిఁ లేవ నెత్తి యుందును.

రాణి—ప్రభూ! నేను ముందే చెప్పియుండలేదా?

అమర-ఔను. చెప్పియుంటివి. నీవు చెప్పినది యథార్థము!

మేవాడ మృతినొందినది! నేనామె యవసానము కన్ను లారఁ జూచుచు నిలువఁబడి యుంటిని! ఆమెను నా భుజములపై మోసికొని యిచ్చటకుఁ గొని వచ్చితిని! ఆ మృత కళేబరమును నీవు చూచెదవా? రమ్ము, జూపెదను.

[చేయి పట్టుకొని దోడ్కొని పోవ యత్నించును. తెర జారును.]

## దృశ్యము 2.

స్థానము:—మహబత్ఖాన్ డేరా!

[మహబత్ఖాన్ డేరా నుండి వెలుపలకువచ్చి సూర్యాస్తమయమును జూచును.]



మహ—(స్వగతము) ఓహో! పగలంతయును ప్రపంచగోళమును విస్తృత్ప్రకాశమున ముంచి అదిగో సూర్యభగవానుఁ డిప్పుడస్తమించుచున్నాడు.; ఆహా! రక్తకాంతి మయ మైన యీ యస్తమయమును జూచుకొలఁదియు నా హృదయమున నేఁడేలనో దుర్వారమగు దుఃఖసముద్ర ముప్పొంగుచున్నది! అప్రయత్నముగ నా నేత్రముల నశ్రుబిందువులు రాలుచున్నవి! నా రాక్షస కృత్య ములన్నియు నా కన్నులకు గట్టుచున్నవి. ఈ సాయం

సమయము నాకు నరక ప్రాయముగ దోచుచున్నది!

సీ॥ దివ సావ సానంపు । తీరు కాదిది, నాదు
జనయిత్రి యవసాన । సరణి కాని!
కమనీయ సాంధ్య రా । గంబు కాదిది, నాదు
ఖడ్గ నిర్గత రక్త । కాంతి కాని
అరుణాస్తమయము గా । దది చూడ మేవాడ
మహిత సౌభాగ్యా స్త । మయము కాని!
మనుజుండఁ గా నేను । మనుజ రూపము దాల్చి
యవతరించిన కాల । యముఁడఁ గాని

గీ॥ అక్కటకట యార్యావర్త । మందుఁ బుట్టి
మాతృహత్య చేసిన మహా । పాతకుండ!
భ్రాతృ వధ యొనర్చిన ఘోర । రాక్షసుండ!
కలఁడె నాయట్టి ఖలుఁడు లో । కంబు నందు!

(విషాదముతో దిరుగుచుండును:—గజసింహుఁడు ప్రవేశించును.)

గజ—ఖాన్ సాహెబ్!

మహ—(తిరిగి చూచి) దయచేయుఁడు మహారాజా!

గజ—ఏమి యోచించినారు? ఉదయపురము మనకు స్వాధీనమైనది కదా; ఇంక నేల దుర్గప్రవేశ మొనర్ప కున్నారు

మహ—మహారాజా! అందులకుఁ గారణ మడుగుచుంటిరా?

గజ-లేదు. ఊరకనే యడిగితిని-ఈసారి మేవాడ దేశమందలి
స్త్రీలు సహిత మస్త్రధారణ మొనర్చిరఁట

మహా-(విస్మితుఁడై) ఎట్లు? మేవాడ దేశమందలి స్త్రీలుసహిత
మస్త్ర ధారణ మొనర్చిరా?

గజ-ఔను. వారెట్లు పోరుదురో చూచెదము గాక! ఈ సారి
యుద్ధమునందుకొంచెము విచిత్రమగు కోమలభావము
సహితముఁ బ్రకటింపఁ బడును. నేనుతప్పక యీ స్త్రీల
తోఁడి యుద్ధమునకుఁ బోయెదను.

మహా(ఇంచుక పరుష స్వరమున) అయ్యా! మీరు రసపుత్రు
లై యుండి యును, రసపుత్త్రి స్త్రీజనము పట్ల నిట్టి
పరిహాసము లాడెదరా? మీ శరీరమునఁ బ్రవహించు
నది రక్తమా లేక పాషాణ పాకమా?

గజ-ఖాన్ సాహెబ్!—

మహా—పొండు, పొండు, పౌరుష లేశము లేక, ఆత్మాభి మా
నము లేక నోరు కొలఁది ప్రేలు వదరు బోతులకు
నా సమక్షమున స్థానము లేదు. పొండు.

గజ-[తలవంచుకొని నిష్క్రమించును.]

మహా-(అపహాసముగ) ఓహో! ఇట్టి నీచాతి నీచులందుఁను
హిందువులు ఇట్టి నరపశువుల! కాశ్రియభూతమైన
పాడు మతమును బరిత్యజించినందులకు నేనొక పాపిని!

(ఒక సిపాయి ప్రవేశించి యభివాదము చేయును.)

మహా—ఏమి సమాచారము?

సిపా_యువరాజుగారు సైన్యసమేతముగ ఆగ్రానుండి వచ్చి యున్నారు.

మహ-యువరాజుగారు వచ్చిరా?మంచిది నీవింక పోవచ్చు.

(సిపాయి నిష్క్రమించును.)

మహ_(స్వగతము) యువరాజు సైన్యసమేతముగ వచ్చుటేల? సైన్యమున కేమి ప్రయోజన మున్నది? వీరి సైన్యము నెదుర్కొనుటకు మేవాడయందెవ్వరు కలరు? మేవాడ రాజ్యము స్వయముగ నా చేతుల యందు సర్వనాశనమైనది! ఇప్పుడింకను సైన్యమేల? ఓహో! ఉదయపుర దుర్గమునందు నే నింకను ప్రవేశింపకుండుటఁ జూచి, యువరాజు స్వయముగ నాపని జేయుటకు వచ్చెనని తోచుచున్నది! నేను ప్రారంభించిన రాక్షస కార్యమును వీరు పూర్తిగావించెదరు. (కొంత నేపు యోచించుచు నూరకుండి, పిమ్మట ప్రక్కను జూచి) ఎవరు వారు?

(ప్రవేశము—గోవిందసింగ్)

మహ-అయ్యా! మీరెవ్వరు?

గోవిం-నేను మేవాడ లోని యొక సర్దారుఁడను.

మహ-నా యొద్ద మీకేమి పనియున్నది? రాణా అమరసింహుఁడు సంధి నిమిత్తము నాకడకు మిమ్ము బంపెనా?

గోవిం_(తీక్ష్ణముగ చూచి) అట్లు జరుగుటకుఁ బూర్వమునాపై నొక పెద్ద పిడుగు పడుఁగాక?

మహ-అట్లయిన మీరేమి కోరి వచ్చియున్నారు?

గోవిం—నేను మరణముఁ గోరి వచ్చియున్నాను! నేను వయో వృద్ధుఁడనైతి. మరణము తప్పమరేమియు నే నపేక్షిం పను.యుద్ధమునందుఁ జావగోరి వచ్చియున్నాను. కాని యొక సాధారణ సైకునితోఁబోరుటను.నేనిచ్ఛగింపను. మహాత్కార్యము లొనర్చి మహాయోధుఁడ నని పించుకొనిన నీతో ఖడ్గ యుద్ధమొనర్చి చచ్చెదరమ్మా.

మహ-మీకు పిచ్చి పట్టినదా? మీ రున్మత్తులవలె గన్పట్టుచు న్నారు.

గోవిం—లేదు, బహబత్ఖాన్ నాకు పిచ్చిలేదు. నే నున్మత్తుఁడ కాను. నీతో ద్వంద్వయుద్ధ మొనర్చెదను. నిన్ను జంపె దను... కాదు. నేను వృద్ధుఁడనైతిని. నిన్ను జయింప జాలను. నేనే నీ చేతులలో జచ్చెదను. నాకోరిక నెర వేర్పుము.

మహ—(నవ్వి)మీకోరిక యత్యద్భుతముగ నున్నదే?

గోవిం—మహబత్ఖాన్ ఇందద్భుత మేమున్నది? నేను యశ్శశరీ రులగు మహారాణా ప్రతాపసింహునకు దక్షిణ భుజ మునైయుండి యా మహావీరునితో సుమారిరువదివర్ష ములు జయాపజయములఁ బొల్గొనియుంటిని! నాశరీర మునందలి గాయముల చిహ్నము లెన్ని యున్నవో యీశ్వరున కెఱుక! కడసారి గాయమును నీచేతఁ బొం దదలఁచి వచ్చియున్నాను. ఏమందువా? ధర్మానుసార

ము నీవు ప్రస్తుతము ముసల్మానుఁడవే యైనను, జాత్య నుసారము నీవు హిందువుఁడవు! రాజపుత్త్రుఁడవు మఱియు,

తే॥ గీ॥ అల మహేశ్వరు నవతార ♦ మైన శ్రీప్ర
తాపసింహుని సోదరా ♦ త్మజుఁడ వీవు!
అట్టి నీయట్టి ధన్యాత్ము ♦ హస్తములను
గడచు కంటెను భాగ్యంబు ♦ కలదె నాకు?

మహా—(యోచించుచు) అట్లైన సాలుంబర్ వీరాగ్రేసరులగు ఠాకూర్ గోవిందసింహులా?

గోవిం—(నవ్వి) గుర్తించితివా? మహబత్ఖాన్! నేనెందులకు నీ చేతుల యందు చావదలఁచితినో యిప్పుడు తెలిసినదా? నేఁడు నీవు మేవాడను జయించితివి! మేవాడను విధ్వంసము గావించితివి! ఉదయపురమిప్పుడు నీధనము గాని, నేను నిన్నీ యుదయపురదుర్గమునందడుగు పెట్ట నీయను! ఈ మేవాడ వీర కోటియందు నేను కడసారి వీరుఁడను! నా కంఠములో జీవములుండ నీవీదుర్గమునం దుఁ బ్రవేశింపఁ జాలవు!-మహబత్ఖాన్! ఖడ్గము నెత్తుము!

(తాను ఖడ్గము దీయును.)

మహా—ఓ రసపుత్ర వీర శిఖామణీ! ఈ యుదయ పురమునందు నేను ప్రవేశింపఁ దలఁచుకొనలేదు.

గోవిం-ప్రవేశింపఁదలఁచుకొన లేదు! ఔను. ఖడ్గము నెత్తుము.

మహా-వినుఁడు—

గోవిం-లేదు. లేదు. వినదలఁచుకొనలేదు. నా హృదయమున బ్రచండాగ్ని రగులుకొనుచున్నది! నా జీవనజ్యోతియైన పుత్త్రుఁడు మరణించెను. నేను సహితము మరణించెదను. ప్రాణాధికయగు నా మాతృభూమి మ్లేచ్ఛ పదఘట్టిత మగుటకుఁ బూర్వము నేను మరణించెదను! ఎవ్వఁడు నాయల్లుఁడై యుండినను, నిరపరాధియగు నా పుత్త్రునిఁ దన పొట్టను పెట్టుకొనెనో, వాని చేతుల యందు నేను చచ్చెదను. ఎవ్వఁడు నాదేశమునఁ బుట్టి యుండియును, విధర్మియై నా దేశమునకు శత్రువయ్యెనో, వాని చేతులయందు నేను చచ్చెదను. ఎవ్వఁడు నా ప్రభువునకు సోదరుఁడై యుండినను, ఆతనిపైఁ గత్తిఁ గట్టెనో, వాని చేతులయందు నేను చచ్చెదను. మహాబత్ఖాన్! ఖడ్గము నెత్తుము!

మహా-(ఖడ్గముఁ దీసి) ఆర్యా! మీరు శాంతింపుఁడు. నేను మీతోఁ బోరాడుదలఁచుకొనలేదు. నామాట వినుఁడు

గోవిం-వినను. వినను. ఖడ్గము నెత్తుము. నిన్ను నీవు రక్షించు కొనుము.

మహా-ఆర్యా!—

గోవిం-వలదు. లెమ్ము. యుద్ధము చేయుము.

మహా-వీరశిఖామణీ! నేను నీతో యుద్ధముఁ జేయను.

(ఖడ్గమును క్రిందఁ బారవేయును.)

గోవిం-మహాబత్! నేను నిన్ను విడువను. నేఁడు నేను మరణింప వచ్చియున్నాను. తప్పక మరణించెదను. ఖడ్గము నెత్తుము. నేను నిన్ను విడువను. (మహాబత్ ఖాన్ చేయిఁబట్టుకొనును.)

[ఇంతలో-వెనుకనుండి తటాలున గజసింహుఁడు ప్రవేశించి తుపాకి ప్రేల్చును. గోవిందసింగ్ నేల వ్రాలును.]

మహా—(చకితుఁడై) ఇదియేమి? ఇదియేమి? (తీక్ష్ణముగ గజసింహుని వైపుఁ జూచి) గజసింహా?

గజ—ఏమి?

మహా—(ఆగ్రహముతో) ఈతఁడెవ్వరో నీకు దెలియునా?

గజ—ఎవ్వఁడు? శత్రుపక్షమునకుఁ జెందిన దొంగకాఁడా?

గోవిం-(చేతులపై లేచి తీవ్రముగ) ఓరీ! భీరూ! కుల కళంకా దొంగను నేను కాను. నీవు దొంగవు! పౌరుషము లేశము లేక పందవలె చాటున నుండి నన్నుఁ గొట్టిన దొంగవు నీవు! నీముఖము జూచిన నిరకప్రాప్తియగును తొలఁగి పొమ్ము.—మహాబత్ఖాన్! ఇంక నీవు స్వేచ్ఛగ ఉదయపుర దుర్గమునందుఁ బ్రవేశించుము! నీ తల్లిని మ్లేచ్ఛులకు.... దాసిగా.... నొనర్పుము ....పొమ్ము... పొమ్ము... హా!... హా! ప్రతాప్ ..మహారాణా ప్రతాప్!... ఇదిగో... నేను సహితము...తమయొద్దకే...

వచ్చుచున్నాను!...హా!....మేవార్...మేవార్!

(మరణించును.— తెరజాఱును.)

## దృశ్యము 1.

స్థానము:—ఉదయపుర సాగరము.

[మానసి ఒంటిగా నిలచి యుండును.]



మాన-(స్వగతము) ఆహా!ఇప్పటికి నాచిత్త చాంచల్యమించుక తగ్గినది. నా దృష్టి తిరిగి యెప్పటి వలెనే రహించినది. ఇప్పుడు మఱల నా కా ప్రేమతరంగిణి యొక్క మృధు మధుర గంభీర సంగీతము వినవచ్చుచున్నది. పూర్వము కంటె వేయి రెట్లు మధుర తరమై, గంభీర తరమై విన వచ్చుచున్నది. నా హృదయాకాశమును గప్పియుండిన విషాద మేఘములు తొలఁగి పోయినవి! నేఁడు నా కర్తవ్యపదము నాకుస్పష్టముగగోచరించుచున్నదిగదా!

తే॥ గీ॥ దుర్నివార జలావర్త । తుల్యమైన
జీవనంపుఁ గష్ట సుఖోగ్ర । చింత లుడిఁగి
లౌకిక వ్యవహార వ । ల్లరులఁ గోసి
క్షితి విరాగినినై చరిం । చెదను నేను!

(ప్రవేశము—కల్యాణి)

మానసి-(తిరిగి చూచి) ఎవరు?—కల్యాణీ!

కల్యా-ఔను రాజకుమారీ!

మానసి-తిరిగి మా "రాజకుమారీ" శబ్దమే! నేటినుండియును మనకొక నూతన సంబాధ మేర్పడినది!—అదేమికల్యాణీ! దుఃఖింపకుము నీసహోదరుఁడు స్వధర్మ నిర్వహణము నందు మరణించి ధన్యజీవనుఁ డయ్యెను. నీ తండ్రి వీర లోకమున కాదర్శ ప్రాయుఁడై వీరస్వర్గమును జూరఁ గొనెను! వానికై నీవేల దుఃఖించెదవు?

కల్యా-లేదు. సోదరీ! నే నింక దుఃఖింపను. (కన్నీరు తుడుచు కొనుచు) నా మనోవేదన దుర్భరమైనది! కావున నేను నీయొద్దకు వచ్చితిని నీవు నాకు ధైర్య మొసంగుము.

మానసి-కల్యాణీ! నీ దుఃఖమును నాకిచ్చి నా సుఖమును నీవు కైకొనుము.

కల్యా-నీ సుఖమా?

మానసి-ఔను, నా సుఖమును నీవు గైకొనుము. నే నిప్పుడు సౌఖ్యమునే యనుభవించుచుంటిని!—పాపము!దుఃఖము నన్ను చూర్ణము చేయఁ దలఁచి వచ్చినది కాని నన్ను జయింపఁ గలదా? పరాజితమై తానే మఱలిపోయినది ఎప్పటికిని దుఃఖము నన్నంటఁ జాలదు.

తే॥ గీ॥ మంత్ర తంత్ర బలంబులఁ । మానవుండు
సర్పమును బట్టి బంధించు । చందమునను
నేను దుఃఖము బంధించి । దాని వలనఁ
గాంతు నెపుడు మదీయ సం । కల్ప సిద్ధి

కల్యా-సోదరీ! నీవు ధన్యవు!

మానసి-నీవు సహితము ధన్య వయ్యెదవు?

కల్యా—ఎట్లు?

మానసి-నా కార్యములను నీవు నాకుఁ దోడ్పుము.రమ్ము. మన సిద్ధబలమును గలసి మానవ జాతి యొక్క కల్యాణము నకై జీవనోత్సర్గమును గావించినను నీ"కల్యాణి"నామము సార్థకము కాగలదు. కల్యాణీ! నీవు నాకు సహాయ్య మొనర్చెదరా?

కల్యా-సాధ్యమైనంత వరకు సహాయము జేసెదను.

మానసి-మంచిది. అప్పుడు నీహృదయ ప్రవృత్తియందు గలుగు విచిత్ర పరివర్తనమును నీవే చూడగలవు. కల్యాణీ! ఈ మహా వ్రతము పూనిన వారికి దుఃఖమే లేదు.

కల్యా—మహానందము, మానసీ! నానిష్ఫల ప్రేమ నీకార్యము నందు సార్థకము కాఁగలదు.

మానసి—కల్యాణీ! నీ వింకను మహాబత్తాను నందు కోపభావ మునే వహించి యుంటివా?

కల్యా-సోదరీ! ఆవిషయమై నేనేమిచెప్పుటకును దోచకున్నది.

ఆనాఁడు రోషభావమున నే నాతని సమక్షము నుండి గిఱ్ఱున తిరిగి వచ్చితిని! వచ్చునప్పుడు మనకిఁక నెట్టి భాంధవ్యమును లేదని స్పష్టముగ జెప్పి వచ్చితిని! కాని, యాతని యెడల నిట్టి హేయభావము వహించుటకై నను నా యందిప్పుడు శక్తి లేకున్నది!

మానసి—కల్యాణీ! అట్టి విచారమునకు నీ కావశ్యకతయే లేదు. నీవు నీ ప్రేమను సమస్త మానవజాతి యందును వ్యాపింపఁ జేయుము. నీకు నిశ్చయముగ శాంతి చేకూరును విశ్వ ప్రేమము ప్రతిఫలమును గోరదు! అది యోగ్యాయోగ్యములను సహితము యోచింపదు! దానికిదియే ఫలితము.

(ప్రవేశము-సత్యవతి)

సత్య—మానసీ! నీ తండ్రిగారు నిన్నుఁబిలచుచున్నారు.

మానసి—వారు తిరిగి వచ్చిరా?

సత్య-వచ్చిరి.

మానసి-మొగలాయీలతో సంధి జరిగెనా?

సత్య—లేదు! మొగల్ యువరాజు మహారాణావారి పేర సంధికై లిఖించిన పత్రమునందు కేవలము శుష్కప్రియములు మాత్రమే యుండెను-

మానసి—అట్లనా?

సత్య—(కొంత సేపూరకుండి) మానసీ! సంధి యెప్పుడైనను సమానులకు కదా జరుగును? జయధ్వనులకు మరణ

రోదనములకును సంధికాఁగలదా? యువరాజు మహారాణావారిని ఉదయపురమును విడచి పొమ్మని కోరెను. రాణా ప్రతాపసింహుని పుత్త్రున కింతకంటె మరణమే. శ్రేయస్కరము కాదా? మానసీ! మేవాడ్ సంపూర్ణ వినాశన మారంభమైనది!

మానసి—సత్యవతీ! మేవార్ వినాశనము నేఁడారంభమైనది కాదు. ప్రారంభమై చాల దినములైనది. ఏనాఁడు మేవాడ రాజ్యము వికృతాచారములకుఁ దావిచ్చినదో; యుక్తాయుక్త పరిజ్ఞానము గోల్పోయినదో యానాఁడే మన మేవాడకు దుర్దినములు ప్రారంభమైనవి!

తే॥ గీ॥ చలనములు మాని యొక్కచో నిలచి, పాడు
కంపుఁగొట్టు మురికినీటి కాల్వ వోలె
సలలితంబైన రసపుత్రి కులము నేఁడు
నిష్ఠురంపు గీటక కోటి నిలయ మయ్యె!

ఈ జాతి యందు స్వార్థము, భ్రాతృద్రోహము, విజాతి విద్వేషము మున్నగు క్షుద్ర దోషములు జన్మించినవి! ప్రాచీన హిందూ ధర్మము శిథిలమైనది! ఔదార్యము నశించినది. దురాచార విజృంభణ మధికమైనది. దురాగ్రహావేశ మారంభ మైనది. ఇంక నీదేశమునకు వినాశనము సంభవించుటయం దాశ్చర్యమేమున్నది! ఈ వేశపనమునకై దుఃఖించిన ప్రయోజనమేమి?

సత్య—దుఃఖింపక చేయున దేమి?

మానసి—సత్యవతీ దుఃఖించుటకంటె ముఖ్యముగుకర్తవ్యమింకొ కటి కలదు. ఈ దేశీయు లిట్టి దుఃఖసమయమున, ఇట్టి నిరాశాంధ కారమున దిగులొంది స్వధర్మ పరిత్యాగము చేయుకుండునట్లు మనము వారికి ధైర్యము గొలుపవలయును. ఈ మహాత్కార్యమున మనకు జయము కల్గినచో మేవాడపోయినను నాకు విచారము లేదు.

సత్య—(కొంతసే పూరకుండి) మానసీ! మాతృదేశ వినాశన మును కన్నులారఁ జూచుచు మనము పాషాణ ప్రతిమ వలె నూరకుండ వలసిన దేనా?

మానసి-లేదు. సత్యవతీ! మాతృదేశమును మనము తప్పక రక్షింప యత్నింతము. ఒకవేళ మన ప్రయత్నమందు మనము విఫలులమైనను మనకు విచారము లేదు ఏమందువా? ఈశ్వరుని మంగళ నియమము పూర్తి కావలయును గదా” మనము సంకుచితమగు స్వజాతీయత నతిక్రమించి సమస్తమానవజాతి కల్యాణమునకై పాటుపడెదము?

ఆ॥ స్వార్థచింత కంటె ♦ జాతీయ చింతయె
ట్లధిక మగునో యట్లె ♦ యరసి చూడ
జాతి చింత కంటె ♦ సకల మానవలోక
చింత వేయి రెట్లు ♦ శ్రేష్ఠము గదె?

మానవుని జాతీయత కేవలము మనుష్యత్వమునకే ప్రతికూలమైనచో అట్టి జాతీయత నశించినను నష్టము లేదు. మనుష్యత్వ విహీనమగు దేశమునకు స్వాతంత్ర్యము తప్పక పోవలసినదే! ఇప్పుడు రాజస్థానము నందు ప్రజలకు మనుష్యత్వము నశించినది. తిరిగి వారలను మనుష్యులను జేయుటయే మన కర్తవ్యము.

సత్య-మానసీ! అట్లెన్నటికైనా జరగునా?

మానసి-ఏల జరుగదు? మనము సర్వవిధముల ప్రయత్నింప వలయును. ఉత్కృష్ట ప్రయత్నము లెన్నఁడైన వ్యర్థము లగునా? తిరిగి యీ దేశీయులు తప్పక మానవు లయ్యెదరు.

సీ॥ మేటి దురాచార । మేఘముల్ తొలఁగి వి
జ్ఞానార్కుఁ డేనాఁడు । కానఁబడును,
అంతర్గతంబైన । స్వార్థ చింతా మహా
రోగ మేనాఁడు ని । ర్మూల్యమగును,
పరివిమల భావ ప్ర । వాహంబు లేనాఁడు
గిరి నిర్ఝరము లట్లు । పొఱలి పాఱు
ఆరిపోవుచునున్న । స్వాభి మాన జ్యోతి
కరిమ్మరల నేనాఁడు । ప్రజ్వరిల్లు!
గీ॥ ఘోరములగు సాంఘిక దురా । చార ములకు
స్వస్తి వాక్య మేనాఁడు ది । క్కనిమితి మోగు,
నాఁడు రసపుత్ర కుల మహా । ర్ణవము నందు
అమృత తుల్యమై మానవ । త్వము జనించు.

అప్పుడు మన దేశీయులు తప్పక మానవు లయ్యెదరు! యున్నత స్థితికి వచ్చిన పిమ్మట స్వయముగ పరమేశ్వరుఁడే వారి కార్యములను నిర్వహించును. జాతీ యోద్ధరణమునకు మార్గము రక్తప్రవాహముల మధ్య లేదు! ప్రేమ పూర్వకము లగు పరస్పరా లింగనముల మధ్యములనుండి యా పావన మార్గము పోవుచుండును. మనము నీచబిరేచులమై స్వాభిమాన విహీనులమై స్వార్థ పరాయణులమై రక్త పిపాసులమై లోకమున వ్యవహరించుచు మహారాణాప్రతాపసింహుని మహత్తర నామమును జపించుచుండిన ప్రయోజన మేమి? ...రంగము. పోవుడము. (నిష్క్రమింతురు.)



## దృశ్యము 1.

స్థానము:—ఉదయ సాగర తీరము.

[మేఘాక్రాంతమైన యాకసమువైపుఁజూచుచు రాణా అమర సింహుఁడు ప్రవేశించును]



అమర-(స్వగతము) ఓహో! కాల మేఘ సంకులమైన యీ యాకసము అల్లకల్లోలమై యున్న నా హృదయమునకుఁ బ్రతికూలము వలెఁ దోఁచుచున్నది! ఆహా! స్వదేశ

విధ్వంసమునకు హేతుభూతుఁడనైన నాయెడ ప్రకృతి యంతయు నిప్పుడెట్టి హేయభావమును వెలిబుచ్చుచు న్నది.

సీ॥ కనుల నిప్పులు రాల । గర్జనేందిరా దేవి
సింహ గర్జనములు । సేయు చుండె!
నను గాంచి చిన్నవో । యిన లీల మేవాడ
పర్వతంబులు తలల్ । వంచు కొనియె!
కసిఁ బూని యుదయ సా । గర సరోవర లక్ష్మి
తొలఁగి గట్టుల నుండి । దూర మరిగె!
అవమాన భరము నో । రువ లేక వసుమతీ
దేవి నిస్తేజయై । తిరుగు చుండె!
గీ॥ అక్కటకట! ప్రతాప సిం । హంబు నకును
స్వైర సంచార భూమియై । వాసిఁ గనిన
పూజ్య మేవాడ సామ్రాజ్య । పుణ్యసీమ
పతిత మయ్యె! వాచేతులఁ । బతిత మయ్యె!

(విషాదముతో యోచించు చుండును.)

(ప్రవేశము-మహాబత్ఖాన్)

అమర—(తిరిగి చూచి) ఎవరు?ఎవ్వరూ! మహాబతాన్ సాహెబ్ దయచేయుఁడు. సేవకుని ప్రణామము లందుకొనుఁడు.

(నమస్కరించును)

మహ—మేవార్ మహారాణాకు జయమగుఁగాక!

అమర-మహాబత్ఖాన్ నేను! నిన్నొక్కసారి కలసికొనఁదలఁచి యుంటిని.

మహా-చెప్పుడు. ఏమి యాజ్ఞ?

అమర-ఓహో! అతి వినయము నీ కిప్పుడలంకార ప్రాయమై యున్నది!-మంచిది,వినుము,నాకింక నొక్క కర్తవ్యము మాత్రము మిగిలి యున్నది. అది నిర్వహించుటకు నీవు తప్ప వేఱొకరు చాలరు!

మహా-ఆజ్ఞాపించుఁడు.

అమర-మహాబత్ఖాన్! ఒక్కసారినీవు నాముఖముపై ప్రుఁజూచి నీకును, నాకును ఎట్టి సంబంధము కలదో చెప్పుము.

మహా-నేను మీ సోదరుఁడను,

అమర-నిశ్చయము! మహాబత్ఖాన్! నీవు నిశ్చయముగ సోదరుఁ డొనర్ప వలసిన కార్యమునే చేసితివి! నా దేశమును భస్మీభూతమొనర్చి నిశ్చయముగ నీవు నా సోదరుఁ డొనర్ప వలసిన కార్యమునే చేసితివి! నా సంతాన ప్రాయమగు ప్రజానివహమును నిరాశ్రయముఁజేసి, నిరాధారముఁజేసి నీవు నిశ్చయముగ నా సోదరుఁడొ నర్ప వలసిన కార్యమునే చేసితివి?

మహా-మహారాణా! నేను మొగలాయి చక్రవర్తి యన్నమును దినిచుంటినిగడా?

అమర-మంచిది. ఆ విషయమై నాకు నీతో వాగ్వివాదము వలదు. ఏమందువా?

తే॥ గీ॥ మహిత కుల గౌరవంబును మంట గలిపి
చెనటి మ్లేచ్ఛుల యుచ్ఛిష్ట మును భుజించి

నట్టి కుక్కవు నీవు! నీ యట్టి మాను
షాధమున కిది యుక్త కార్యంబ కాదె?

నీ యౌదార్య విశేషముచే నీవు మేవాడను విధ్వంసము జేసితివి! కాని, నీ కర్తవ్య మింకను పూర్తి కాలేదు. మేవాడతోఁ బాటు? మేవాడ రాణాను సహితము నీ విప్పుడంతము చేయవలయును. ఇదిగో ఈ ఖడ్గము నందుకొనుము!

(ఖడ్గమును ముందుఁ బెట్టును.)

మహ—మహారాణా!—

అమర-వలదు, మహబత్! ఇంక నేమియును జెప్పవలదు. నీవు నిన్ను వధించి తీరవలయును అంతమాత్రమున గళంకమే మాత్రమును వృద్ధి కానేరదు. నీ కప్రియమగు కార్యమును నేను చేయుమనుట లేదు. నీవు నా రక్తమును చవిఁజూచుటకు వేచియుంటివని నాకు దెలియును. నాప్రాణములను దీయుటకు నీ దక్షిణ హస్తము అత్యాతురమునఁ గంపించుచున్నది! మహబత్ఖాన్, ఖడ్గము నెత్తుము!

మహ-మహారాణా! మహబత్ఖాన్ హృదయ మంత నీచము కాదని తెలిసికొనుఁడు. నేను మేవార్ దేశమునకు జిచ్చు రగిల్చి శ్మశానమును గావించిన మాటసత్యమే! కాని, నే నధర్మ యుద్ధమును జేయలేను!

అమర—అట్లైన నీవు చేసినది ధర్మ యుద్ధమే యగునా? ఒక చిన్న దేశముపై నొక మహాసామ్రాజ్యము యొక్క

విపుల సైన్యాక్రమణము! ఒక చిన్న నిప్పు కణము నార్పుటకు మహాసముద్ర ప్రవాహము! ఒకానొక శిశు హృదయమునకు భయంకర నరక స్వప్నము! మహబత్ఖాన్! ఇది ధర్మ యుద్ధమే యగునా?— పోనిమ్ము నేడు నీవు జయించితివి! కాని, నీవిజయమునకు మాత్ర మింకను కొంచెము కొఱంత యున్నది! (ఖడ్గమును జూపుచు) ఇదిగో ఈ చంద్రహాసమును నా తండ్రి యగు మహారాణా ప్రతాపసింగ్ తన యవసాన కాలమున నా కిచ్చెను. ఇచ్చునపుడు, 'నాయనా! అనేకసంగ్రామ జయాభి షిక్తమగు నీ ఖడ్గమును నేను నీకిచ్చుచున్నాను. దీనికి అవమానము కలుగకుండ కాపాడుము" అని యెలుగెత్తి పల్కి ప్రాణత్యాగము జేసెను. అట్టి మహాఖడ్గమునకు నేడు నాచేత నవమానము కల్గినది! కళంకము వాటిల్లినది! ఆకళంకము నేడు నారక్తధారలచే గడుగుకొని పోవలయును! మహబతాన్! లెమ్ము ఖడ్గము నెత్తుము!

మహ—మహారాజా! మహబత్ఖాన్ యోధుఁడుగాని, ఘాతుకుడు కాఁడు!

అమర-మంచిది. యోధుఁడవేయైనను ఖడ్గము దీయుము. యుద్ధము జేయుము

మహ—మహారాజా! నేను మేవాడ్ దేశమునకు విరుద్ధముగ నస్త్రధారణము జేయుట మానుకొంటిని!

అమర—ఓహో. ఈ వైరాగ్య మెప్పటినుండి కల్గినది!—లెమ్ము. లెమ్ము. మేవార్ శ్మశాన వాటికపై నామాతృదేవత మృతదేహము సమక్షమున నేను నిన్ను ద్వంద్వ యుద్ధమున కాహ్వానించుచుంటిని. రమ్ము ఖడ్గము నెత్తుము.

మహ-మహారాజా! వినుఁడు——

అమర—(తీవ్రముగ) వినను. వినను! భీరూ! కులపాంసనా! వంశ ద్రోహీ! యుద్ధముఁ జేయుము. హిందూస్థానమంతయు గడ గడ వణకునంతటి వీరత్వము నీయందేమి కలదో చూచెదను. ఖడ్గము నెత్తుము.

(తటాలున మానసి మఱికొందరు సన్యాసినులతో ప్రవేశింతురు)

మానసి-ఇదేమి! తండ్రీ! ఇదేమి! తండ్రీ! శాంతింపుఁడు. జరిగిన దేదియో జరిగి పోయినది! తిరిగి యిప్పుడా సర్వనాశనమును రక్తపాతమొనర్చి రంజిత మొనర్పకుఁడు! మన హృదయ వేదనకుఁ బ్రతీకారము హత్య కాదు! రాక్షస కృత్యమగు హత్య కాదు! మనము పశుత్వము విడచి తిరిగి మానుషత్వము వహించుటయే యిందులకు బ్రతీకారము?

అమర-మానసీ, అదియెట్లు పొసగును?

మానసి—తప్పక పొసఁగును.

తే॥ గీ॥ శత్రు మిత్ర విభేద లే • శంబు లేక
విశ్వ మానవ ప్రేమయన్ • విమల జలము
వలన హృదయ మాలిన్యమున్ • బాపుకొనిన
మానుషత్వంబు లభియించు • మనకుఁ దండ్రి!

చారణులార పాడుఁడు. నేను మీకు నేర్పిన ప్రేమ గీతమునుపాడుఁడు.

(చారణులతోఁ గలసి మానసి పాడును.)

మహా—సహోదరా, మాతృభూమికి సర్వనాశనము సమగూర్చిన ఘాతుకాత్ముఁడను నేను! మదాంధుఁడనై బంధు విద్రోహమునకుఁ బాల్పడిన ఘోరరాక్షసుండను నేను. సహోదరా నీవునన్నుక్షమింపుము. నన్నుక్షమింపుము.

(అమర సింహుని పాదములపై వ్రాలును.)

అమర—(మహాబత్ఖానుని లేవనెత్తి కౌఁగిలించుకొనును.)

(తెర జాఱును.)

—♦ పంచమాంకము. ♦—

సంపూర్ణము.



శ్రీరామ ముద్రిణాలయము, బరంపురం.

# భారతీ మాస పత్రిక (మదరాసు)

శ్రీయుత వంగోలు వేంకట రమణయ్యగారు, బి. ఏ. బి. యల్

**మా రాయబారముం** గూర్చి యిట్లు వ్రాసినారు ............................................................

"వీని రచించినవారు భాగవతుల నరసింహ శర్మగారు. వీరిగ్రంథమున రాయబారమునకు పూర్వాంగమగు భారత కథాసన్నివేశప్రశంస కొలదిగ జరిగి యావల రాయబార వృత్తాంత మారంభమయినది. ద్రుపద పురోహిత దౌత్యము, సంజయురాయబారము, శ్రీకృష్ణసందేశము మూడును గలవు. గ్రంథసరళి బహువిపులముగను, పౌరాణికఫక్కిక ననుసరించినదిగను ఉన్నది. ప్రతి ప్రకరణమునకును మేలు బంతిగ గ్రంథాంతరములనుండి పద్యమో, శ్లోకమో, కూర్పబడియున్నది. మఱియు గ్రంథము నందంతటను కథానుసూచకములగు సామెతలు, న్యాయములు ప్రయోగింపఁబడి యున్నవి. సామెతలు సామాన్యముగ ప్రతిపుటయందును గానవయ్యెడిని. న్యాయములలో ఘట్టకుటీప్రభాతన్యాయము, సింహావనగుప్తిన్యాయము— ఇట్టి కొన్ని యపూర్వన్యాయములు జేర్పబడియున్నవి. పాండవులకు రా జ్య భా గా ర్హ త క ల దా, లే దా య ను ప్ర స ం గ ము వా ద ను,............అధునాతనమగు అవిభాజ్య సంస్థానశాసన (Impartible Estate Act) ప్రశంసయు జేయబడియున్నది. ఈవిధముగనె ననేకములగు ఇదానీంతన విషయములును స్పృశింపబడియున్నవి. ప్రజాపాలనము (Democracy) ను గూర్చిన ప్రసంగమునకు అవకాశము గల్గించుకొనబడియున్నది. ఇట్లెల్ల నూతనప్రచార పరిచయమును మెండుగ జేయబడియున్నది. ఈగ్రంథమున నందందు చేయబడియుండు అహింసాసిద్ధాంతమును పాఠకమహాశయు లెట్లు గణింతురో విచారింప వలసియున్నది.

దౌత్యవిషయమున సంజయుని చిత్తవృత్తికిని, శ్రీకృష్ణుని చిత్తవృత్తికిని గల భేదము లెస్సగ జూపబడినది. సంజయుండంత రాత్మచే పాండవపక్షపాతిగ

నున్నను కౌరవులదూత యగుటచే నిష్కల్మషముగ నిజస్వామిసంకల్పము నుద్ఘటించినాడు. శ్రీకృష్ణుడు కేవల పాండవపక్షమునే యని చెప్పవలసిన వాఁడైయున్నాడు. ఈ యిద్దరిలో సంజయునిస్థితి కష్టతరముగ దోఁపగలదు.

కర్ణుని ఋజుప్రవర్తనను, ప్రభుభక్తిని, ఆశ్రితపరత్వమును కుంతియు శ్రీకృష్ణుడును సడలింపలేకపోయిరి. ధృతరాష్ట్రుని యధీరతయు, స్వాత్మదార్ఢ్యశూన్యతయు దుర్యోధనుని మూర్ఖతయు, దుశ్శాసనుని దుండగమును, సాత్యకి న్యాయ్య రోషావేశమును బాగుగ వర్ణింపఁబడినవి.

సంభాషణలు తగిలినచోట్లనెల్ల గ్రంథకర్త ఆధునికములగు పబ్లికు మీటింగుల వ్యవస్థ ననువదించియున్నాడు. విద్యార్థులు గాని వారికిని ఉపయుక్తముగు లాగున నీగ్రంథము పురాణప్రవచనధోరణి ననుసరించి హృద్యమై యున్నది.........................................................

యుద్ధముకొఱకు కొందరు రాజులు పాండవపక్షమునను, కొందరు కౌరవపక్షమునను జేరుటకుఁగల కారణములు, కారణాంతరములు విశదీకరింపబడియున్నవి. ఆయారాజులకు పరవారితోఁగల స్పర్థలు, విరోధకారణములు సూచింపబడియున్నవి. భారతయుద్ధము కేవల కురుపాండవప్రసక్తమయినదే కాక ఇతరకారణములచేతగూడ సంభవింపవలసినదై యున్నదను నభిప్రాయము తెలియుచున్నది. అర్జునుడు సన్న్యసించియుండినను భారతయుద్ధము జరిగియుండునను భావము నరసింహశర్మగారి గ్రంథమువలన తేటపడఁగలదు శ్రీకృష్ణుడు చెప్పినటుల పాండవులు నిమిత్తమాత్రు లయిరి.............

భారతోద్యోగపర్వమునకేకాక సామాన్యముగ భారతేతిహాసమునకొక వ్యాఖ్యారూపముగ నున్నదనదగును.....................................

భాగవతుల నరసింహశర్మగారి గ్రంథము బరంపురమున పూడిపెద్దివారి వీధిలో వేగుఁజుక్క కార్యస్థానమున లభింపగలదు. తపాలుఖర్చులు గాక నికరము వెల రూ, **1—8—0**

